# విజేతలు


బని మరియు మిత్రులు ఎవరెస్ట్ పర్వతాన్ని ఎక్కుతున్నారు. శిఖరం చేరుటకు కాదు-వాళ్ళ ఉద్దేశమే వేరు. హిమ మానవుణ్ణి వెతకుటకు పోతున్నారు.


హే! అడుగు జాడలు, ఇవి ఎక్కడ్నించి వస్తున్నాయ్?
బహుశా, ఏటిదే అయివుండాలి.


వాళ్ళకొక మంచి ఉపాయం తగిలింది...
ఈ మిఠాయిలతో వాడికి దోవ చేసి, మనం దాక్కొని వేచివుందాం.


కాని వాళ్ళు వేచివుండి విసిగి పోయారు... చాలా సేపు


మనం చాలా సేపు వేచాం. రండి. పోయి చూద్దాం.


వాళ్ళకు ఆశ్చర్యం
మీరు నన్ను పట్టుకోలేరు! కాని, మీ మిఠాయిలు నిజానికి ఉత్కృష్ట చవిగలవి! — యేటి.


ఇందాకా ఎవరూ హిమ మానవుణ్ణి కనిపెట్టలేదు. కాని అలాంటి గొప్ప పట్టుకోలేని వ్యక్తినుండి మనం గొప్ప సర్టిఫికేట్ తెచ్చాం

# "తోడేలు, తోడేలు" కథలో న్యూట్రిన్ బని

అరణ్యంలో ప్రశాంతమైన, చల్లటి రోజుల ఒక ఉదయం...

రక్షించండి!

అది రెడ్ రైడింగ్ హుడ్ ధ్వని ఉన్నట్లుంది...

...కష్టంలో ఉన్నట్లుంది

బని మరియు మిత్రులు ధ్వని వచ్చే దిక్కుగా పోతారు

వాళ్ళు ఇల్లు చేరుతున్నప్పుడు...

అదిగో, దుష్ట తోడేలు పరిగెడుతున్నది రండి పట్టుకొంటాం!

అది అతివేగంగా పరుగిడుతుంది, కాని...

రండి ఈ దోవలో పోదాం

బని మరియు మిత్రులు ఆ పెద్ద దుష్ట తోడేలును అడ్డుకోడానికి దగ్గిర దారి పట్టారు

...బని తెలివితో చేసి పెట్టిన ఉచ్చులో చిక్కుకొన్నది

చిక్కుకొన్నావా దుష్ట తోడేలు!

ఈ విధంగా దుష్ట తోడేలు చిక్కుకొన్నది... ...చెట్టులోకి కట్టుబడి.

జేజమ్మ ఊపిరి పీల్చుట పిల్లుకు కష్టమా

నీకు మిఠాయిలు దొరకవు

జేజే లేవండి, పోదాం రండి...

చిన్నారిలారా, మళ్ళీ చూద్దాం మీకు మధురకలలు కనిపించని!

## న్యూట్రిన్

ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరిత విందు!

nutrine

CAS NC 62-82 TE

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>188, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Pvt Limited<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Chandamama Publications<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | B. NAGI REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'Chandamama Buildings'<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries: |

1. B. V. HARISH
2. B. V. NARESH
3. B. V. L. ARATI
4. B. L. NIRUPAMA
5. B. V. SANJAY
6. B. V. SHARATH
7. B. L. SUNANDA
8. B. N. RAJESH
9. B. ARCHANA
10. B. N. V. VISHNU PRASAD
11. B. L. ARADHANA
12. B. NAGI REDDI (JR)

All Minors, by Trustee:
M. UTTAMA REDDI, 14, V.O.C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1st *March* 1982

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

# చందమామ

నంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''వెలలేని వజ్రం''] కు ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన. నీతిపరులైన వ్యక్తులు, మోసాలతో బతికేవాళ్లకు అమాయకుల్లా కనబడతారు. అలాంటి ఒకరిని సాధించవచ్చు ననుకుని భంగపడిన మోసకారినిగురించి, ''దివాణం దున్నలు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

క్వచిద్దుష్టః క్వచిత్తుష్ట, దుష్టస్తుష్టః క్వచిత్ క్వచిత్,
అవ్యవస్థిత చిత్తానాం, ప్రసాదోపి భయంకరః.

[స్థిరబుద్ధి లేనివాడు యీ క్షణంలో తృప్తినీ, మరుక్షణంలో అనంతృప్తినీ ప్రదర్శిస్తాడు. అందువల్ల, అలాంటి వాడి దయకు పాత్ర మవడం కూడా ప్రమాదకరమే!]

సంపుటి 70 మార్చి '82 సంచిక 3

విడి ప్రతి : 1-75 : : నంవత్సర చందా : 21-00




CHITRA



# బంగారం పిచ్చి

తల్లి వెంట గుడికి వెళ్ళిన రవి, దేవుడి దర్శనం చేసుకుని బయిటికి వచ్చాడు. తల్లి యింకా గర్భగుడిలో ఏవో అర్చనలు చేయిస్తున్నది.

"కొత్త చెప్పులు కాజేయాలని గుడికి వచ్చావా? నిన్నీ గుడి దగ్గిర ఏనాడూ చూడలేదు," అంటూ ఒక అమ్మాయి నవ్వుతూ రవి దగ్గిరకు వచ్చింది.

రవి ఆ మాటలకు తెల్లబోయాడు.

"అలా తెల్లమొహం వేశావేమిటి? రఘు కనిపిస్తే, వెంటనే పంపమని, మీ నాన్న చెప్పాడు," అన్నదామె.

ఆ అమ్మాయి తనను ఎవరో రఘు అనే అతడనుకుంటున్నదని రవి, "మా నాన్న నా చిన్నప్పుడే పోయాడు. నేను రఘును కాను; పొరబడుతున్నావు," అన్నాడు.

ఆమె ఆశ్చర్యంతో రవిని తేరిపార చూస్తూ, "ఏమిటీ, నా కళ్ళను, నేనే నమ్మలేకపోతున్నాను! నువ్వు అచ్చం రఘులా వున్నావు. మీరు, ఒకరినొకరు చూసుకుంటే, అద్దంలో ముఖం చూసుకుంటున్నామనుకుంటారు," అన్నది.

అచ్చం తన లాంటి వాడు యింకొక డున్నాడన్న సంగతి విని, రవికి చాలా కుతూహలం కలిగింది.

ఆమె, రవిని తన ఇంటికి తీసుకుపోయి, గదిలో ఒక కుర్చీ చూపిస్తూ, "ఇలా కూర్చో, యిప్పుడే రఘును పిలుచుకు వస్తాను," అంటూ బయిటికిపోతూనే, చప్పున గదితలుపు మూసింది.

ఆమె, రవికి కిటికీలోంచి ఒక కాయితం, కలం అందించి, "ఇప్పుడు నువ్వు నా ఖైదీవి! ఈ కాయితం మీద నేను చెప్పినట్టు రాయి. అప్పుడు, మీ అమ్మకెలాంటి ప్రమాదమూ జరగదు," అన్నది కరకుగా.

మాచిరాజు కామేశ్వరరావు

రవి విస్తుపోతూ, ''నువ్వెవరు ? నన్నీ గదిలో ఎందుకు బంధించావు?'' అన్నాడు.

''ప్రశ్నలకు సమాధానాలు రావు. ఊఁ, నే చెప్పబోయేవి రాయి,'' అంటూ ఆమె గట్టిగా కసురుకున్నది.

రవి, ఆమె చెప్పినట్టుగా తల్లికి, తను క్షేమంగా తిరిగిరావాలంటే, యీ ఉత్తరం తెచ్చిన అమ్మాయికి, ఉన్న నగలన్నీ యివ్వవలసిందని రాశాడు. ఆమె, ఆ కాయితం తీసుకుని, ఇంటికి తాళం పెట్టి, వెళ్ళిపోయింది.



ఆ అమ్మాయి గుడి దగ్గిరకు వెళ్ళేసరికి, రవి తల్లి అతడి కోసం దిక్కులు చూస్తున్నది. ఆమె రవి తల్లిని సమీపించి, కాయితం ఆవిడ చేతి కిచ్చింది.

ఉత్తరం చదివిన రవి తల్లి ముఖం పాలిపోయింది. ''నగలన్నీ యివ్వమని రాశాడు. అన్నీ ఇంట్లోనే వున్నవి; యిచ్చేస్తాను. నా కొడుక్కు మాత్రం ఎలాంటి హానీ చెయ్యకు,'' అన్నది వణుకుతున్న గొంతుతో.

రవి తల్లి ఆమెను ఇంటికి తీసుకుపోయి, ఇనప్పెట్టె వున్న గది చూపి, ''నీకు కావలసిన నగలు తీసుకో !'' అని వాకిలి దగ్గిరకు పోయింది.

ఆమె, ఇనప్పెట్టెలోని నగలన్నీ మూట గట్టుకుని లేచి చూస్తే, గదితలుపు మూసి వున్నది. రవి తల్లి బయట కిటికీ దగ్గిర నిలబడి, ''నా కొడుకు, యీ గదిలోకి వచ్చాక, నువ్వు గడపదాటివెళతావు-- ఇంటికి కాదు; తిన్నగా చెరసాలకు ! నా వంటపని పూర్తయ్యేలోపల, నా కొడుకు ఎక్కడ వున్నాడో మర్యాదగా చెప్పు,'' అని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

ఆసరికి బాగా చీకటిపడింది. తనను గదిలో బంధించిపోయిన ఆవిడను గురించి ఆలోచిస్తూ, రవి కుర్చీలోంచి లేచి, దీపం వెలిగించాడు.

ఒకటి, రెండు నిమిషాలు గడిచేలోపల పక్కవాటాలోంచి గదితలుపు తెరుచుకుని వస్తూనే, ''సరళా, నీకో శుభవార్త !



నా కాబోయే అత్తగారు పూర్తిగా మారిపోయారు,'' అంటూ ఒక అమ్మాయి వచ్చి, రవిని చూసి నిర్ఘాంతపోయింది.

''ఎవరు మీరు? మా సరళ ఎక్కడ?'' అన్నదామె, రవికేసి అనుమానంగా చూస్తూ.

''మీ సరళ నన్ను గదిలో బంధించి, మా అమ్మగారి నగలు దోచుకునేందుకు వెళ్ళింది,'' అన్నాడు రవి వెటకారంగా.

ఆమె కళ్ళింతచేసి, ''ఎంత పొరబాటు జరిగిపోయింది! సరళకు ఆవేశమే తప్ప, ఆలోచన బొత్తిగా లేదు,'' అని తనలో తాను అనుకుంటున్నట్టుగా పైకే అనేసింది.

''మీరిద్దరేనా, తోడుదొంగలు యింకా వున్నారా? మీ స్నేహితురాలు సరళ తెచ్చే నగలలో మీ వాటా ఎంత?'' అన్నాడు రవి.

''ఛీ, ఛీ, మేం దొంగలం కాదు! నా పేరు అనిత. జరిగిందేమిటో చెబితే, మీరు సరళను అర్థం చేసుకుంటారు,'' అని, ఆమె రవికి సంగతంతా చెప్పింది:

సరళ, అనిత చిన్నప్పటినుంచీ ఒకే ఇంట్లోని పక్క, పక్కవాటాల్లో పెరిగి పెద్దవాళ్ళయారు. సరళ మంచి చొరవ గలది, ధైర్యస్థురాలు. అనిత తండ్రి వైద్యుడు. తండ్రి దగ్గిర వైద్యం నేర్చిన అనిత, ఆయన పోయాక, స్వయంగా వైద్యం చేస్తూ, తల్లిని పోషిస్తున్నది.

నాలుగురోజుల క్రితం సరళ తల్లి దండ్రులతోపాటు, పొరుగూరిలోని బంధువుల ఇంట పెళ్ళికి వెళ్ళింది. ఆ సమయంలో అనితకు పెళ్ళిచూపులు జరిగినై. పెళ్ళికొడుకు లోగడే అనితను ఎరుగును. అతను రోజూ తల్లిని వెంటబెట్టుకుని గుడికి వెళతాడట! గుడి ఆవరణలోని తోటలో మందులకు పనికివచ్చే ఆకులూ, మూలికల కోసం తరచు వెళ్ళే అనితను చూసి, వివాహమాడాలనుకున్నాడట. అయితే, అనిత మాత్రం అతణ్ణి యిదే మొదటి సారిగా చూడడం.

అతని తల్లికి తగని బంగారం పిచ్చి! ''పిల్ల మెడలో కనీసం పది తులాల

బంగారం వుంటే తప్ప, యీ పెళ్ళి జర గదు,'' అని ఆమె అనిత తల్లికి చెప్పేసింది.

అనిత ఒంటి మీద అరతులం బంగారం కూడా లేదు!

సరళ బంధువుల ఇంట పెళ్ళయి పోయాక, ఆ పల్లెలో ఏమీతోచక, ఒంటరిగా ఆ ఉదయమే ఇంటికి తిరిగి వచ్చింది. అనిత ద్వారా పెళ్లిచూపుల సంగతి తెలుసు కుని, ''మాయదారి బంగారం కోసం, బంగారం లాంటి కోడలిని వదులు కుంటుందా, ఆ మహా తల్లి! రోజూ గుడికి కొడుకుతోపాటు వస్తుంది గదా, యివ్వాళే ఆవిడకి తగిన బుద్ధి చెబుతాను,'' అన్నది ఆవేశంగా.

''నీకు పుణ్యం వుంటుంది, యిక యీ సంగతిమరిచిపో,'' అన్నది అనిత.

ఇది జరిగిన సాయంత్రం అనిత తన ఇంటి పక్కవీధిలో వున్న ఒక రోగికి మందిచ్చి వస్తూండగా, దారిలో తనను చూడవచ్చిన పెళ్ళికొడుకు ఎదురుపడి, ''మా అమ్మ విపరీతమైన కడుపునొప్పితో బాధపడుతున్నది. కాస్త వచ్చి చూడు,'' అన్నాడు.

ఇల్లు చేరాక అతను అనితను వాకిట్లో వుండమని, తల్లి దగ్గిరకు వెళ్ళి, ''సమ యానికి అనిత తప్ప మరే వైద్యుడూ ఇంటి పట్టున లేడు,'' అని చెప్పాడు.



''ఎవరో ఒకరు, తొందరగా పిలుచుకు రా. ఈ నొప్పితో ప్రాణంపోయేలావున్నది,'' అని తల్లి పెద్దగా మూలిగింది.

''అనిత రానన్నది. మీ అమ్మగారికి బంగారమే ప్రాణం కదా? అదే యింత మింగి ప్రాణం నిలుపుకోమన్నది,'' అని అతను అబద్ధం చెప్పాడు.

''బుద్ధిగడ్డితిని, బంగారానికీ, కాబోయే కోడలికీ లంకె పెట్టాను. క్షమాపణ కోరా నని చెప్పి, తీసుకురా,'' అన్నది తల్లి.

ఈ మాటలు విన్న అనిత కాబోయే అత్తగారి దగ్గిరకు పోయి ఒకటి, రెండు ప్రశ్నలడిగి మందు యిచ్చింది. క్షణాల మీద తల్లి కడుపునొప్పి తగ్గిపోయింది.

ఆమె అనితతో ఆప్యాయంగా, "నీ మందు సంజీవిలా పనిచేసింది! లోగడ జరిగింది మరిచిపో. రేపే నిశ్చితార్థం జరిపేందుకు మీ యింటికొస్తాం," అన్నది.

ఈ శుభవార్త సరళకు చెప్పేందుకు అనిత, తమ ఇంటి వాటాలోంచి తలుపు తీసుకుని సరళా వాళ్ళ ఇంట్లోకి వచ్చింది.

అనిత, రవికి యిదంతా చెప్పి, "మీ తల్లీ కొడుకులను చూసి సరళ, నన్ను పెళ్ళి చూపులకు చూడవచ్చిన వారని పొర బడింది. ఆమెలో పరోపకారబుద్ధే తప్ప స్వార్థం లేదు," అన్నది.

రవి, అనితను వెంటబెట్టుకుని తన ఇంటికి వెళ్ళేసరికి, సరళ గది మధ్య విచారంగా కూర్చుని వున్నది. అనిత, సరళకు జరిగిన పొరబాటు గురించి చెప్పింది. సరళ బిక్కమొహం వేసుకుని రవీ, అతని తల్లితో, "నా తొందరపాటుకు విచారిస్తున్నాను, క్షమించండి," అన్నది.

రవి చిరునవ్వుతో సరళ కేసి చూస్తూ, "నా కాబోయే భార్య చొరవా, ధైర్యం కలది కావాలని, నా కోర్కె. వీటికితోడు మంచి తెలివితేటలు కూడా అవసరం. ఏడాది తిరగకుండానే యీ విషయంలో మా అమ్మ, నిన్ను సానబట్టగలదు. అభ్యంతరం లేకపోతే, నిన్ను పెళ్ళి చేసుకుంటాను," అన్నాడు.

"నాకు చొరవ వుంది, మీకది బొత్తిగా లేదు. తలుపు బిగించి, అడగ్గానే ఉత్తరం రాసి యిచ్చిన పిరికివాళ్ళు, మీరు," అన్నది సరళ.

"నువు కొత్త దొంగవని, అనుభవం లేని నీ ప్రవర్తన వల్ల గ్రహించాను. నీ తోటివాళ్లు, ఏపాటి రాటుతేలిన దొంగలో తెలుసుకునేందుకు, నువ్వు చెప్పిన విధంగా కాయితం రాసి యిచ్చాను. నేను రక్షకభటాధికారిని!" అన్నాడు రవి.

"ఇకనేం! మనం చిన్నప్పటినుంచీ కోరుకున్నట్టుగా, ఒకే ముహూర్తంలో యిద్దరి పెళ్ళి జరగబోతున్నది," అంటూ అనిత నవ్వింది. సరళ చిరునవ్వు నవ్వుతూ తలవంచుకున్నది.






## 5

[మందరదేవుడికి, శివదత్తుడితో పరిచయం అయింది. అప్పుడు శివదత్తుడు, కుండలినీ ద్వీప రాజు వినోదాలతో కాలక్షేపం చేయటం, దేశం అరాజకం పాలుకావటం, చివరకు రాజధానీ నగరాన్నే శత్రువులు ముట్టడించటం; ఆ పరిస్థితుల్లో సేనానాయకత్వం నరవాహనుడికి లభించే ప్రమాదం కలగటం — అంతా చెప్పుకుపోతున్నాడు. తరవాత—]

శివదత్తుడు చెప్పుతున్నదంతా, శ్రద్ధగా ఆలకిస్తున్న మందరదేవుడికి, క్షణక్షణానికీ ఆశ్చర్యం అధికం కాసాగింది. మహా సముద్రం మీద, ఆ కారుచీకటిలో పడవలు ఎటుకేసి పోతున్నదీ అతడు గమనించటం లేదు. చివరకు అతడు శివదత్తుడి మాటలకు అడ్డువచ్చి, "శివదత్తా, సేనానాయకత్వం దుష్ట నరవాహనమిశ్రుడి పాలబడకుండా, మీరు అడ్డుకోలేకపోయారా? మీరే స్వయంగా సేనానాయకత్వం స్వీకరిస్తే సరిపోయేది గదా?" అన్నాడు.

ఆ మాటలకు శివదత్తుడు నవ్వి, "మందర దేవా! ఆనాటి పరిస్థితుల్లో అది అంత తేలికయిన మాట గాదు. నాకై నేను సేనానాయకత్వాన్ని యివ్వమని అడగటం ఏం బావుంటుంది? అట్లని నాయకత్వం దుష్టుడి చేతబడనీయటమూ శ్రేయస్కరం కాదు! అందుకని నేను

మార్గాంతరం ఏమిటా అని ఆలోచించ సాగాను. నా వాలకం గమనించిన సమర సేనుడు:

"శివదత్తా, ఏమిటాలోచిస్తున్నావు? చెప్పదలచినదేమైనా వుంటే, నిస్సంకోచంగా చెప్పు." అన్నాడు.

ఈ అవకాశం లభించగానే, నేను ఆయనతో యిలా చెప్పాను:

"సమరసేనా! ఇప్పటి పరిస్థితుల్లో మీరే సేనానాయకత్వం వహించటం మంచిదని నేను భావిస్తున్నాను. శత్రుబలం, వాళ్ళు పంపిన సందేశాన్ని బట్టి చూస్తే— అంత తేలికగా కొట్టివేయవలసింది కాదు. దురదృష్టవశాత్తూ మన సైన్యం ఒక్కసారి వాళ్ళ చేతుల్లో ఎంత చిన్న దెబ్బ తిన్నా, అది మరికొందరు శత్రువులు మన మీద ధ్వజం ఎత్తటానికి ఉత్సాహం కలిగిస్తుంది. కనుక మీరే సైన్యనాయకత్వం స్వీకరించండి."

సమరసేనుడు ఒక్క క్షణం ఆలోచించి, తలవూపి "సరే, అలాగే చేస్తాను!" అన్నాడు.

అంతలో అక్కడికి నరవాహన మిశ్రుడు వచ్చాడు.

అతణ్ణి చూస్తూనే సమరసేనుడు, "నరవాహనా! నీ కోసం కబురు పంపుదామనుకుంటున్నాను. సరే, నువ్వు వెంటనే వెళ్ళి సైన్యసమీకరణ చెయ్యాలి. ఒక గంట వ్యవధిలో కనీసం రెండువేలమంది సైనికులనైనా సమాయత్త పరచాలి.



సూర్యాస్తమయం లోపల శత్రుశేషం లేకుండా చేయవలసి వుంది.'' అన్నాడు.

నరవాహనమిశ్రుడు అక్కడినుంచి వెళుతూ, నా కేసి చిన్నగా నవ్వాడు. అది విషపునవ్వు. కాని అందులో ఎంత కాలకూటవిషం వున్నదో ఆ క్షణాన నేను గ్రహించలేకపోయాను.

సమరసేనుడు నా కేసి తిరిగి, ''శివదత్తా! నువ్వు కూడా నీ అనుచరులను సమాయత్తం చేయి. ఎందుకయినా మంచిది — కనీసం పాతబడిన కత్తుల తుప్పయినా వదిలించవచ్చు,'' అన్నాడు నవ్వుతూ.

నేను నా అనుచరుల్లో మెరికల వంటి వారిని, ఒక పాతికమందిని సర్వసన్నద్ధం చేశాను. మహాసేనాని అయిన సమరసేనుడి నాయకత్వం కింద శత్రువులతో పోరాడి చాలాకాలం అయింది. తిరిగి అలాంటి అవకాశం వస్తున్నదని చాలా సంతోషించాను.

ఒక గంట కాలం గడచిపోయింది. నరవాహనమిశ్రుడు, సైన్య సమీకరణ చేసి, ఆ వార్త చెప్పేందుకు వస్తాడని నేనూ, సమరసేనుడూ ఎదురుచూస్తూ కూర్చున్నాం.

గంటతరవాత నరవాహనుడు రానే వచ్చాడు. ఆతడి వాలకం చూసి, మేం యిద్దరం చాలా ఆశ్చర్యపడ్డాం.

అతడి ఒరలో కత్తి లేదు! ధరించిన దుస్తులు చిరిగిపోయి వున్నవి, జుట్టంతా





రేగి వున్నది. మొహం మీద అక్కడక్కడా చిన్న గాయాలు కూడా కనిపించినై. మనిషి చాలా భీతిగొన్నట్టు కనిపించాడు.

"ఏం, నరవాహనా! ఏం జరిగింది? అలా వున్నా వేమిటి?" అంటూ సమర సేనుడు ఎంతో ఆదుర్దాగా అతణ్ణి ప్రశ్నించాడు.

నరవాహనుడు మాట్లాడేందుకు ప్రయత్నించాడు. కాని గొంతు జీరపోయినట్టు కనబడింది. "పరిస్థితులు మన చేజారి పోయినై. ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు. మనం సురక్షిత ప్రదేశానికెక్కడికైనా పారిపోవటం మంచిది," అన్నాడు నరవాహనుడు బొంగురు గొంతుతో.

ఆ మాటలు వింటూనే సమరసేనుడు తోకతొక్కిన తాచుపాములా లేచి నిలబడ్డాడు. ఆయనలో అంత కోపోద్రేకం, తొందరపాటూ—అనాటివరకు నేను చూచి వుండలేదు.

"నా రాజ్యంలో నేను సురక్షిత ప్రదేశానికి పారిపోవటమా? ఈ కుండలినీ ద్వీపంలోని ప్రతి అంగుళం భూమీ, నాకు రక్షణ యివ్వగలిగినదే! నీ కేమీ పిచ్చి పట్టలేదు గదా?" అన్నాడు సమర సేనుడు.

నరవాహనమిశ్రుడు వణికిపోయాడు. తిరిగి సమరసేనుడు ఏమో మాట్లాడబోయేంతలో, కోట ముఖద్వారం వేపు నుంచి భయంకరారావాలు వినిపించినై. పెనుతుపానుకు మహావృక్షాలు వణికినట్టు మేం వణికిపోయాం.

"ఏమిటా అరుపులు? కాపలా సైనికులు ఏం చేస్తున్నారు?" అంటూ సమర సేనుడు, నరవాహనుడి కేసి చూస్తూ కఠినంగా ప్రశ్నించాడు.

"సమరసేనా! అదే నే చెప్పదలుచుకున్న భయంకర వార్త! సైనికులు, ప్రజలతో కలిసిపోయారు. 'రాజును గద్దె నుంచి దింపాలి,' అని అరుస్తూ వాళ్ళు వీధులలో ఊరేగుతున్నారు. నేను సైనికులను సమీకరించేందుకు ప్రయత్నించాను.

అందుకు వాళ్లు నాకు చేసిన బహూకరణ యిది! ప్రాణాలతో పారిపోయి మీ దగ్గరకు రాగలగటం, కుండలినీదేవి కరుణ!" అన్నాడు నరవాహనుడు. ఆ మాటలు వింటూనే సమరసేనుడు, నెత్తిన పిడుగు పడిన వాడిలా కూలబడ్డాడు. ఎవరికోసం అయితే తను అన్నిటికీ తెగించి, మంత్రాల దీవిలో పడరాని యిడుములు పడ్డాడో— ఆ ప్రజలు ఆపత్సమయంలో తన నాయకత్వాన్ని తృణీకరించటం, సమరసేనుణ్ణి నిలువునా కూల్చింది. పాపం, అతడికి ఈ మధ్యకాలంలో వచ్చిన పరిణామాలూ, దుష్ట నరవాహనుడి కుటిల పాత్రా తెలియదు!

''సమరసేనా, అధైర్య పడకండి. ఏదో విధంగా యీ ప్రమాదాన్నుంచి బయటపడే మార్గం ఆలోచించండి,'' అన్నాను.

సమరసేనుడు పెద్దగా నిట్టూర్చి, ''శివదత్తా నేను అధైర్యపడుతున్నానని అనుకోకు. ప్రజలు నా పట్ల ఎంత కృతఘ్నులుగా ప్రవర్తిస్తున్నారో ఆలోచించినప్పుడు, నా హృదయం భగ్గున మండుతున్నది. అంతకన్న మరేం లేదు,'' అన్నాడు.

ఆయన్ని ఎలాంటి మాటలతో అనునయించాలో నాకు తెలియలేదు. నరవాహనుడికేసి చూశాను. అతడు స్థాణువులా కదలా మెదలక వుండిపోయాడు. ఆ క్షణంలోనే కోటద్వారం వేపు నుంచి భీకరమైన జనఘోష వినబడింది. అంతలో ఒక ద్వారపాలకుడు పరుగెత్తుకుంటూ మా దగ్గరకు వచ్చాడు.



ఏమిటి సంగతి అని నే నడిగేంతలో— ''మహాసేనానీ, ప్రమాదం ముంచుకొస్తున్నది. ప్రజలు కోట ద్వారం బద్దలు కొడుతున్నారు!'' అన్నాడు.

సమరసేనుడు ఒక క్షణకాలం తల వంచుకుని వుండిపోయాడు. అతడు ఆ ద్వారపాలకుడి మాటలు విన్నాడో లేదో అన్న అనుమానం కూడా నాకు కలిగింది.



నేను మాట్లాడబోయేంతలో ఆయనే తల ఎత్తి నా కేసి చూశాడు. ఆ చూపుల్లో వున్న భావం నా కర్థమైనట్టయింది.

''మృగశాలాధిపతిని వెంటనే యిక్కడకు పిలుచుకురా!'' అని ద్వారపాలకుణ్ణి ఆజ్ఞాపించాను. కొద్దిసేపటిలో మృగశాలాధిపతి వచ్చాడు. అతడు రాగానే, ''నీ స్వాధీనంలో వున్న మృగాల నన్నిటినీ, బోనుల్లో నుంచి వదిలిపెట్టు. పోతే, అవి ప్రాసాద ప్రాంగణంలో, ముఖద్వారం దగ్గరా మాత్రమే వుండేట్టు చూడు. అవసరం అయినప్పుడు తిరిగి వాటిని బోనుల్లో పెట్టేందుకు, నీ కింది నౌకర్ల నందర్నీ సిద్ధంగా వుంచు,'' అని ఆజ్ఞ యిచ్చాను.

మృగశాలాధిపతి తెల్లబోతూ సమరసేనుడి కేసి ప్రశ్నార్థకంగా చూశాడు. సమరసేనుడు విసుగ్గా తలపంకించి, ''శివదత్తుడి ఆజ్ఞలన్నిటినీ, నా ఆజ్ఞలగానే భావించి శిరసావహించు,'' అన్నాడు.

''....కాని సేనానీ, ఒకసారి ఆ క్రూర జంతువులను వదిలితే, బయట వున్న ప్రజల మీద....'' అని మృగశాలాధిపతి ఏమో చెప్పబోయాడు. అప్పుడు నేను కోపంగా, ''అవన్నీ నీ కనవసరం. కోట ద్వారాన్ని బద్దలుకొడితే, ఏం జరుగుతుందో ముందుగా వాళ్ళు గ్రహించటం చాలా మంచిది! నువ్వు వెంటనే వెళ్ళి నే చెప్పిన పని చెయ్యి!'' అన్నాను.

మృగశాలాధిపతి వెంటనే వెళ్ళిపోయాడు. నరవాహనుడి కేసి చూశాను. అతడు పళ్ళుబిగించి, నా కేసి క్రోధంగా దొంగచూపులు చూస్తున్నట్టు గ్రహించాను. అతడి ఎత్తుగడ ఏమిటి? ఈ సైనికులా, ప్రజలా తిరుగుబాటులో అతడి దుష్టపాత్ర ఎంతవరకూ వుంటుంది? ఇలాంటి ప్రశ్నలకు అప్పట్లో నాకు జవాబు దొరకలేదు.

ఒక అరఘడియ గడిచేసరికి, మా కర్ణపుటాలు బద్దలయ్యేలా సింహగర్జనలూ, ఏనుగుల ఘీంకారాలూ వినిపించినై. కోట ప్రాంగణమంతా క్రూరమృగాల అరుపులతో, ఆర్భాటాలతో ప్రతిధ్వనించింది.

సమరసేనుడు ఠక్కున లేచి గబగబా భవనం ముందుభాగాన గల ఎత్తయిన మంటపం మీదికి వెళ్ళాడు. అక్కడ నిల బడి చూస్తే, భవనం ముందు గల ఖాళీ ప్రదేశం, ముఖద్వారానికి గల ఇనప కమ్ములూ, ఆ వెనక వీధిలో గోలగా అరు స్తున్న ప్రజలూ—అంతా కనబడుతుంది.

సమరసేనుడి వెనుకనే, నేనూ వెళ్ళి మంటపం మీద నిలబడ్డాను. బోనుల్లో నుంచి విడవబడిన క్రూరమృగాలు ప్రాంగణం అంతా విచ్చలవిడిగా విహరి స్తున్నై. కొన్ని ముఖద్వారానికి గల ఇనుప కమ్ములలోంచి చూస్తూ, అవతల వున్న ప్రజల మీదికి పంజాలు చాచి గర్జించ సాగినై.

"శివదత్తా, చాలా చక్కని యోచన చేశావు!" అంటూ సమరసేనుడు నా కేసి తిరిగి చిరునవ్వు నవ్వాడు. "ఈ క్రూర మృగాల భయమే వాళ్ళను కోట ద్వారం బద్దలుకొట్టకుండా ఆపింది. అయినా యిది తాత్కాలికంగా మనకు ఊపిరి పీల్చుకు నేందుకు లభించిన అవకాశం మాత్రమే అనుకుంటాను. ఇంత అరాజకానికీ కారకు లైన ఆ నాయకులెవరు? అంతా అయో మయంగా వుంది," అంటూ వెనక్కి తిరిగి చూశాడు.

నరవాహనుడు, మాకు కొంత వెనకగా చేతులుకట్టుకు నిలబడి వున్నాడు. అతడు మా దగ్గరకు వచ్చి, "సమరసేనా, వాళ్ళు రాజును పదవీచ్యుతుణ్ణి చేయాలని పట్టు బడుతున్నారు. నాయకులెవరో నాకూ తెలియదు," అన్నాడు.

సమరసేనుడు కొంచెంసేపు వూరుకొని, తరవాత యిలా అన్నాడు: "దేశం యింత అరాజకస్థితిలో వున్నదని నే నెన్నడూ ఊహించనైనా లేదు. పట్టణ ప్రాకారాల అవతల శత్రువులూ, లోపల రెచ్చిపోయిన ప్రజలూ! వీళ్ళకు రాజు గద్దె దిగితే చాలు; వాళ్ళకు రాజ్యాధికారమే కావాలి! పరిస్థితి యిదే ననుకుంటాను. అంతేగదా, శివదత్తా?" అని నన్ను ప్రశ్నించాడు.

—(ఇంకా వుంది)






# వెలలేని వజ్రం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పైనుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రి వేళ నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే నాకు జాలి కలుగుతున్నది. గొప్ప సంపదనో, కీర్తిప్రతిష్ఠలనో ఆశించి ఒకవేళ యిందుకు పూనుకున్నావేమో నాకు తెలియదు. కాని, ఒక్కొక్కసారి యిలాంటి కోరికలు కష్టనష్టాలకు దారి తీయగలవు. ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక రాజూ, కట్టెలు కొట్టుకు జీవించే వాడి కథా చెబుతాను, శ్రమతెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వజ్రగిరి రాజ్యానికి రవివర్మ రాజు. ఆ రాజ్యంలోని ఒక అరణ్యప్రాంతంలో చంద్రయ్య అనే కట్టెలు కొట్టుకు జీవించే

## బేతాళ కథలు



వాడొకడుండేవాడు. వాడికి గోపీ అని పదేళ్ల కొడుకు. బడికి పొమ్మన్న తండ్రి మాటలు లక్ష్యపెట్టకుండా వాడు అరణ్య ప్రాంతాల ఆటలాడుతూ తిరుగుతూండేవాడు.

ఒకనాడు గోపీ, ఒక సెలయేటి ఒడ్డున ఇసుకలో ఆడుకుంటూండగా వాడికి రంగు రంగుల గాజురాయి ఒకటి దొరికింది. వాడు దానితో కొంతసేపు ఆడుకుని, ఇంటికి తెచ్చాడు. గోపీ తండ్రి కట్టెలమోపుతో తిరిగి వచ్చి, ఆ వింత రాయిని చూసి మెచ్చుకున్నాడు.

గోపీకి గోవిందు అనే స్నేహితుడున్నాడు. తనకు దొరికిన రాయిని గోపీ వాడికి చూపించాడు. తన దగ్గిర అలాంటి అందమైన రాయి లేనందుకు గోవిందుకు అసూయ కలిగి, దాన్ని తస్కరించాలనుకున్నాడు. ఆ సాయంత్రంలోపల వాడు గోపీతో ఆటలాడుతూ, అతడు ఆదమరచి వున్నప్పుడు దాన్ని దొంగిలించి ఇంటికి తీసుకుపోయాడు.

గోవిందు తండ్రి పెద్ద తాగుబోతు. ఆ రాత్రి గోవిందు నిద్రపోయాక వాడు ఆ రాయిని కల్లు దుకాణానికి తీసుకుపోయాడు. అక్కడికి తరుచు వస్తూండే ఒక నగల దుకాణంలో పనిచేసేవాడి కంట బడింది, ఆ రాయి. వాడి కళ్ళు దురాశతో మెరిశాయి. ఆ రాయి ఎంతో కొంత విలువైనదిగా వాడికి తోచింది.

గోవిందు తండ్రి బాగా మైకంలో వుండగా, నగలదుకాణం పనివాడు ఆ రాయిని చేజిక్కించుకుని, మర్నాడు పెద్దబజారులోని వజ్రాలవ్యాపారి దగ్గిరకు వెళ్ళాడు.

వ్యాపారి ఆ రాయిని చూస్తూనే అది వెలలేని వజ్రం అని గ్రహించి, ఒకటి రెండు క్షణాలు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయి, అంతలోనే తేరుకుని అయిష్టంగా ముఖంపెట్టి, "ఈ దిక్కుమాలిన రాయి నీ కెక్కడ దొరికింది? ఇది రంగు రంగుల గాజు గోళం! దీనికి పూచికపుల్ల విలువ కూడా లేదు. ఏదో శ్రమపడి

తెచ్చావు గనక, యీ వరహా పట్టుకుపో,'' అని, పనివాడి చేతిలో ఒక వరహా పెట్టాడు.

ఆ రాత్రి వజ్రాలవ్యాపారి ఆ రాయిని సానబట్టాడు. ఎంతో విలువ గల ఆ వజ్రం కాంతులు వెదజల్లుతూ, వ్యాపారి కళ్ళను మిరుమిట్లుకొల్పింది. రాజు రవివర్మకు వజ్రాలన్నా, వైడూర్యాలన్నా అపరిమిత మైన మక్కువ. ఈ వజ్రంతో తనకు సిరి ఎత్తుకున్నట్టేనని వ్యాపారి మురిసి పోయాడు.

సూర్యోదయంతోపాటే లేచి వజ్రాల వ్యాపారి రాజును చూడబోయాడు. రవి వర్మ ఆ వజ్రాన్ని చూసి పరమానందం చెందాడు. ఈ వజ్రం తన లాంటి గొప్ప రాజు కిరీటాన్ని అలంకరించదగిన యోగ్యత గలదని చెప్పి, వజ్రాలవ్యాపారికి చాలా ధనం యిచ్చాడు.

మర్నాడు రాజు వజ్రాన్ని తన కిరీటంలో అలంకరించుకుని సభాప్రాంగణంలో అడుగుపెట్టాడు. సభామండపం వింత వింత కాంతులతో వెలిగిపోయింది. సభి కులు కిరీటం కేసి కళ్ళప్పగించి చూడ సాగారు. ఇది రవివర్మకు అంతులేని ఆనంద కారణమయింది.

ఈ అమూల్యమైన వజ్రాన్ని గురించిన సమాచారం కొద్దిరోజుల్లోనే పొరుగు రాజైన వీరసింహుడికి తెలిసింది. సైనికబలం



లోనూ, అర్థబలంలోనూ యితడు రవి వర్మను మించినవాడు. అంత గొప్ప వజ్రాన్ని తన కిరీటంలో ధరించే అవకాశం కలగనందుకు అతడికి చాలా బాధ కలిగింది.

వజ్రాన్ని వెంటనే తనకు పంపమనీ, అలా కానప్పుడు యుద్ధం తప్పదనీ వీర సింహుడు, రవివర్మకు కబురు చేశాడు. తాను బలహీనుణ్ణని ఎరిగి కూడా, వజ్రం మీది మమకారంతో రవివర్మ, దాన్ని వీర సింహుడికి పంప నిరాకరించాడు.

వీరసింహుడు వజ్రగిరి రాజ్యం మీద దాడి చేసి, యుద్ధంలో రవివర్మను చిత్తుగా ఓడించి, వజ్రంతోపాటు అతడి సింహాస



నాన్ని కూడా తనదిగా చేసుకున్నాడు. అతడు రవివర్మ కిరీటం నుంచి వజ్రాన్ని బయిటికి తీసి, దాన్ని తన కిరీటంలో తాపడం చేసేందుకు పనివాళ్ళ కోసం కబురు పంపాడు. ఈ లోపల దాన్ని ఒక బంగారుపళ్ళెంలో వుంచి, తన శయనాగారానికి వెళ్ళాడు.

వీరసింహుడి చిన్నకొడుకు అయిదేళ్ళవాడు ఆ వజ్రాన్ని చూసి వింతపడి, ఆడుకునేందుకు దాన్ని తీసుకుని ఉద్యానవనంలోకి వెళ్ళాడు. ఆ సమయంలో ఆకాశంలో ఎగురుతున్న డేగ ఒకటి, దాన్ని చూసి ఏదో తినదగిన వస్తువనుకుని, వేగంగా వచ్చి దాన్ని తన్నుకుపోయింది.

తరవాత వీరసింహుడికి తాను పళ్లెంలో వుంచిన వజ్రం ఏమయిందో అంతుబట్టలేదు. దాసదాసీలు తమకు తెలియదన్నారు. అతడి చిన్నకొడుకు దాని సంగతి ఉద్యానవనంలోనే మరిచిపోయాడు.

డేగ వజ్రాన్ని దూరంగా అడవిలోకి ఎత్తుకుపోయి, ఒక చెట్టుకొమ్మ మీద పెట్టి, తినేందుకు ప్రయత్నించింది. కాని, అది తినదగిన వస్తువు కాదని తెలిసిపోవడంతో, అక్కడే వదిలి వెళ్ళిపోయింది.

ఒకనాడు గోపీ తండ్రి చంద్రయ్య కట్టెలు కొట్టుకునేందుకు, ఆ చెట్టు దగ్గిరకే వచ్చాడు. వాడు గొడ్డలితో ఒక ఎండు కొమ్మను నరికి, మోడు ఆధారంతో చెట్టు పైకి కొంచెం దూరం పోయేసరికి, కొమ్మ మీద తళతళ మెరుస్తూ వజ్రం కనిపించింది. ఒక్క క్షణం ఆనందంతో తన్మయుడైపోయి, చంద్రయ్య ఆ వజ్రాన్ని తీసుకోబోయినవాడల్లా, చప్పున చెయ్యి వెనక్కు లాక్కుని, చెట్టు దిగి, తిరిగిచూడకుండా తన గ్రామం కేసి పరిగెత్తాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకు వజ్రగిరి రాజు రవివర్మ ప్రవర్తనతో పాటు, యీ కట్టెలు కొట్టుకునేవాడి ప్రవర్తన కూడా వింతగా కనబడుతున్నది. ఆ వెలలేని వజ్రం మీది మమకారంకొద్దీ రవివర్మ, తనకన్న బలవంతుడైన రాజును

ఎదిరించి సర్వనాశనమైపోయాడు. అడగగానే దాన్ని వీరసింహుడి పరం చేసివుంటే, అతడికి రాజ్యమైనా దక్కేది గదా? కట్టెలు కొట్టుకు బతికే చంద్రయ్య దాన్ని చూసి అంతగా ఎందుకు భయపడాలి? దాన్ని ఎవరికి అమ్మినా, వాడి దారిద్ర్యం తీరిపోయేది! ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజా, కట్టెలు కొట్టుకునేవాడి ప్రవర్తనల్లో వింత పడవలసిందేమీ లేదు. అది సంఘంలో వాళ్ళకున్న హెచ్చు, తగ్గు స్థానాలకు అనుగుణంగానే వున్నది. అపూర్వంగా కనిపించే ఏ వస్తువునైనా కోరడం, దాని మీద మమకారం కలిగివుండడం మానవ నైజానికి విరుద్ధమేం కాదు. పొరుగు రాజు యుద్ధ భయం చూపి అడిగినంతనే, అతడికి వజ్రాన్ని యివ్వడమంటే, తాను ఆ రాజుకు సామంతుణ్ణని అంగీకరించడం అవుతుంది. ఇది క్షాత్రధర్మం కాదు. అలాంటి పిరికివాడు రాజ్యపాలనకు అనర్హుడు. ఈ సంగతి ఎరిగినవాడు గనకనే రవివర్మ క్షత్రియోచితంగా శత్రురాజును ఎదిరించాడు. ఇక, యుద్ధంలో జయాపజయాలనేవి, కేవలం ఒక్క ధర్మాధర్మాల మీద ఆధారపడేవి కాదు.

కట్టెలు కొట్టుకు జీవించే చంద్రయ్య ప్రవర్తనలోనూ వింతపడవలసిందేమీ లేదు. తాను చెట్టుకొమ్మ మీద చూసిన వజ్రం సింహాసనాలనే కూలదోసిందని వాడికి తెలుసు. ఆ వజ్రం వాడి దృష్టిలో పరమ వినాశకారి. మనిషిని ఒకే సమయంలో ధనాశా, ప్రాణభయం ఆవహించినప్పుడు, తెలివిమంతుడు ప్రాణరక్షణకే ప్రాధాన్యత నిస్తాడు. ఆ కారణం వల్లనే కట్టెలు కొట్టేవాడు వజ్రాన్ని అంటకుండా, తన గ్రామం కేసి పారిపోయాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)



# పాలకవర్గం

రంగాపురం జమీందారు వీలు చిక్కినప్పుడల్లా, తన జమీలోని గ్రామాలను సందర్శించి, ప్రజల మంచి చెడ్డలు విచారించేవాడు.

ఒకసారి ఆయన రామాపురం అనే ఊరు వెళ్ళినప్పుడు, గ్రామ ముఖ్యుల సమావేశం శివాలయం మండపంలో ఏర్పాటు చేయబడింది. జమీందారూ, గ్రామాధికారీ వేదిక మీద కూర్చున్నారు. గ్రామస్థులు ఒక్కొక్కరే సభకు రాసాగారు. కాని, వచ్చిన వారంతా వేదిక ముందున్న నాలుగు ఖాళీ కుర్చీలనూ వదిలి, వాటి వెనకగా సర్దుకు కూర్చోసాగారు.

జమీందారు కొంచెం ఆశ్చర్యపోయి, "కుర్చీలు అలా ఖాళీగా వదిలేశారేం? గ్రామ ముఖ్యులు కొందరైనా వాటిల్లో కూర్చోండి," అన్నాడు.

జమీందారు యిలా అనగానే జనం మధ్యలోంచి ఒకడు లేచి, "వస్తాదు వీరయ్యా, కల్లు పాక పాపయ్యా, రంగసాని తమ్ముడు బంగారాజూ, వడ్డీ వ్యాపారి వరహాలశెట్టీ, యీపాటికి సభకు బయలుదేరే వుంటారు. వారిని కింద కూర్చోమనడం బావుండదు గదా," అన్నాడు.

దానితో జమీందారుకు గ్రామ పరిస్థితి అర్థమైపోయింది. ఆయన గ్రామాధికారి కేసి కొర కొరా చూసి, "గ్రామ పాలకవర్గంగా నీకు సహాయపడుతున్న వాళ్ళు, యిలాంటి వాళ్ళన్నమాట! నిన్ను గ్రామాధికారి పదవి నుంచి తొలగిస్తున్నాను. నిండు సభలో వున్న సంగతి ధైర్యంగా చెప్పిన ఆసామీ, ఇకనుంచి గ్రామాధికారి," అన్నాడు.

సభలో వున్నవారంతా సంతోషంగా చప్పట్లు చరిచారు.

—జొన్నలగడ్డ రత్న






# గుర్తులేని లెక్కలు

పేరవరం జమీందారు శేఖరబాబు వద్ద, ఈశ్వరయ్యా అనే అతను లెక్కలు చూస్తూండేవాడు. ఈశ్వరయ్యా చాలా నమ్మకస్థుడు, చురుకైనవాడు. జమీందారుకు అతడంటే ఎంతో అభిమానం.

ఒకసారి జబ్బు చేసి ఈశ్వరయ్యా మంచంపట్టాడు. జమీందారు తన సొంత వైద్యుడితో ఈశ్వరయ్యా ఇంటికి వచ్చి, రోగిని పరీక్ష చేయించాడు.

వైద్యుడు శ్రద్ధగా రెండువారాలపాటు ఈశ్వరయ్యాకు చికిత్స చేసి, అది కుదిరే వ్యాధి కాదని నిశ్చయించుకుని, ఆ మాట శేఖరబాబుకు చెప్పాడు. శేఖరబాబు యీ సంగతి వైద్యుడి చేత ఈశ్వరయ్యా కుటుంబానికి చెప్పించి, తాను స్వయంగా రోగిని చూడడానికి వచ్చాడు.

తన ఆరోగ్య పరిస్థితి రోజురోజుకూ దిగజారి పోతున్నదని గ్రహించిన ఈశ్వరయ్యా, శేఖరబాబుతో, "అయ్యా, నాకున్నది ఒక్కడే కొడుకు. నేను పోయాక, నా కొడుక్కు దివాణంలో నేను చేసిన ఉద్యోగం యిస్తారని నమ్ముతున్నాను. తమరు అలా చేయకపోతే, నా కుటుంబం వీధిపాలవుతుంది," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"ఈశ్వరయ్యా, నువ్వలా విచారించకు. ఆ ఉద్యోగాన్ని, నీ కొడుక్కు యివ్వాలని ఏనాడో నిశ్చయించుకున్నాను. నువ్వు నిశ్చింతగావుండు," అన్నాడు శేఖరబాబు.

ఆ తర్వాత మూడురోజులకు ఈశ్వరయ్యా చనిపోయాడు. ఒక వారంరోజులు ఆగి జమీందారు, ఈశ్వరయ్యా కొడుక్కు కబురుచేశాడు. అతను జమీందారును చూడబోయిన సమయంలోనే, ఒక పారుగూరు వాడు ఆయన దగ్గిరకు వచ్చి, ఉత్తరం ఒకటి యిచ్చాడు.

ఆ ఉత్తరం రాసింది, రాజవరం జమీందారు. అందులో ఆయన, ఆ ఉత్తరం తెచ్చినవాడు తనదివాణంలో ఆరుసంవత్సరాలుగా లెక్కలు రాసే పని చేస్తున్నాడని తెలియపరిచాడు. ఇప్పుడతను తన స్వగ్రామమైన పేరవరంలో వుండదలచినందున, దివాణంలో లెక్కలు చూసే పని యివ్వవలసిందిగా కోరాడు.

ఈ ఉత్తరం జమీందారు శేఖరబాబును చాలా యిరుకున పెట్టింది. లెక్కలు చూడడంలో ఆరేళ్ళ అనుభవం వున్న వ్యక్తిని, తను ఏ వంకతో ఉద్యోగం లేదని పంపి వేయగలడు? అలాకాక, తను అతడికి ఉద్యోగం యిస్తే, ఈశ్వరయ్య కొడుకూ, అతడి కుటుంబం పస్తులుండవలసి వస్తుంది!

జమీందారు ఉత్తరం తెచ్చినవాడితో, "మీ జమీందారు గత సంవత్సరం, వెయ్యి వరహాలు అప్పుగా తీసుకుని యింతవరకూ పంపలేదు. వెళ్ళి, ఆయనకు సంగతి చెప్పి, రేపు వచ్చి కనబడు," అన్నాడు.

అతను అప్పటికప్పుడే బయలుదేరి పోయి, మర్నాటికి తిరిగివచ్చి, శేఖరబాబుతో, "అయ్యా, మా జమీందారుగారు మీ కేమీ బాకీ లేనట్టు చెప్పమన్నారు. వారి జమీలోనే రాజవరం అనే కుగ్రామం ఒకటి వున్నది. అక్కడ ఎవరైనా మీ వద్ద అప్పు తీసుకుని వుండవచ్చు," అన్నాడు.

శేఖరబాబు నవ్వి, "మీ జమీందారుగారు నా కేమీ బాకీ లేరు. ఆరు సంవత్సరాలుగా రాజవరం దివాణంలో లెక్కలు చూస్తున్నావని తెలిసి నీతో చిన్న అబద్ధం ఆడాను! నువ్వు హడావిడిగా పోయి, మీ జమీందారుగారిని బాకీ సంగతి అడిగి వచ్చావు. దీన్నిబట్టి, నీకు రాజవరం దివాణం లెక్కలు ఏమాత్రం గుర్తులేవని తెలిసిపోతున్నది. అలాంటి నీకు, నా దివాణంలో ఉద్యోగం దొరకదు," అన్నాడు.

తరవాత ఆ రోజే ఆయన ఈశ్వరయ్య కొడుక్కు దివాణంలో లెక్కలు చూసే ఉద్యోగం యిచ్చాడు.



# నీకే లాభం!

ఒక గ్రామంలో జోగులు అనే యువకుడుండేవాడు. వాడికి ఒళ్ళు వంచి పని చెయ్యడమంటే మహా బద్ధకం. "ఛీ, పో!" అని చీదరించుకున్నా సరే, వాడు గ్రామంలోని గృహస్థుల ఇళ్ళకు పోయి, ఎవరైనా యింత అన్నం పెడితే తిని, రాత్రికి గ్రామ పొలిమేరల్లో వున్న అమ్మవారి శిధిలాలయంలో హాయిగా నిద్రపోయేవాడు.

ఒకసారి వాడికి వరసగా రెండు రోజులు తిండి దొరకలేదు. వాడు ఆకలితో నకనక లాడుతూ రాత్రికి అమ్మవారి గుడి చేరి, "గ్రామంలో అన్నదాన మహిమ ఎరిగిన పుణ్యాత్ములే లేకుండా పోయారు!" అంటూ తిట్టుకోసాగాడు.

వాడి బాధ చూసి జాలిపడిన అమ్మవారు ప్రత్యక్షమై, "ఒరే, జోగులూ! కాలూ, చెయ్యీ బాగా వున్న నువ్వు, బిచ్చమెత్తుకోవడం ఎందుకు? కష్టించి రోజూ పనిచేసి, ఒక రూపాయి నాకు యిచ్చావంటే, నీకు పది రూపాయిలిస్తాను," అన్నది.

జోగులు ఎంతో భక్తితో అమ్మవారికి నమస్కరించి, "తల్లీ, నేను రోజూ కష్టించి పని జెయ్యడం ఎందుకు? నువ్వు యిస్తాననే పది రూపాయిల్లో ఒకటి నువ్వే వుంచుకుని, మిగిలిన తొమ్మిది రూపాయిలూ నా కిచ్చెయ్యి. ఒక రూపాయి నీకే లాభం గదా!" అన్నాడు.

—దాసరి వెంకటరమణ





# దివాణం దున్నలు

లక్ష్మీపురం జమీందారు సత్యమూర్తికి, కృష్ణాపురంలో కొన్ని పొలాలున్నవి. ఆ పొలం పనులు చూసేందుకు ఆయన, వెంకయ్య అనే పాలేరును నియమించాడు. పాలేరు విశ్వాసపాత్రుడూ, నమ్మకస్థుడూ కావడంతో, జమీందారుకు లక్ష్మీపురం నుంచి అతనిపై అజమాయిషీకి మరొక ఉద్యోగిని పంపనవసరం లేకపోయింది.

వ్యవసాయపు పనులకు గాను జమీందారు, రెండు ఖరీదైన దున్నపోతులను కొని, వెంకయ్యకు తోలిపెట్టాడు. వెంకయ్య వాటికి వేళకు మేతా, దాణాలూ పెడుతూ, ఎండ సమయంలో చెరువుకు తోలుకుపోయి శుభ్రంగా కడిగేవాడు. అవి ఆరోగ్యంగా, బలంగా వుండి, ఎంత బరువునైనా సునాయాసంగా లాగగలిగేవి. ఆ చుట్టుపక్కల గ్రామల్లో వాటికి సాటిరాగల దున్నలు లేవన్న పేరు వచ్చింది. వెంకయ్య వాటికి ముద్దుగా దివాణం దున్నలని పేరు పెట్టుకున్నాడు.

జమీందారు బావమరిది కొమరయ్య కృష్ణాపురంలోని పొలం పంటలూ, వ్యవసాయపు ఖర్చుల విషయంలో తప్పుడు లెక్కలు రాసి, డబ్బు తస్కరించాలని ఎత్తులు వేస్తూండేవాడు. కాని, వెంకయ్య నిజాయితీ కారణంగా అతడి ఆటలు సాగేవికావు. ఇందువల్ల అతడికి వెంకయ్య మీద చెప్పరానంత ద్వేషం వుండేది.

ఒకరోజున వడ్లబస్తాలతో వున్న బరువు బండి ఒకటి జమీందారు పొలం పక్కనే వున్న పంటకాలవలో దిగబడి పోయింది. చుట్టుపక్కల పొలాలలోని కాపులు చక్రం పట్టి, ఎంత ప్రయత్నించినా, బండికి కట్టి వున్న దున్నలు దాన్ని బయిటికి లాగలేక పోయినై. అదిచూసి వెంకయ్య జాలిపడి, జమీందారుగారి దున్నలను బండికి

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

కట్టాడు. బలిష్ఠమైన ఆ దున్నలు, బండిని అవలీలగా కాలవలోనుంచి లాగి ఒడ్డుకు చేర్చినై.

ఈ సంగతి విన్న కొమరయ్య లక్ష్మి పురంవెళ్ళి జమీందారుతో, "బావగారూ, పాలేరు వెంకయ్య దున్నల్ని అడ్డమైన వాళ్ళందరికీ సహాయపడేందుకు ఉపయో గిస్తున్నాడు. మనం వాటిని ఎంతో ఖర్చు పెట్టి పోషిస్తున్నది, మన వ్యవసాయ పనుల కోసంగదా !" అంటూ వెంకయ్య ఏదో చెప్పరానినేరం చేశాడన్న ధోరణిలో మాట్లాడాడు.

జమీందారు చిన్నగా నవ్వి, మీసం దువ్వుకుంటూ, "కొమరయ్యగారూ! కాలవ బురదలో దిగబడిపోయిన బండిని నా దున్నలు బయిటికి లాగినవంటే, అది నా కెంతో గర్వకారణంగా వున్నది. ఈ విషయం నేను లోగడనే విన్నాను. వెంకయ్యకు పాతిక రూపాయిలు బహు మానంగా కూడా పంపాను" అన్నాడు.

కొమరయ్య కిక్కురుమనకుండా జమీందారుతో భోజనం చేసి, కృష్ణాపురం వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఒక పండగకు జమీందారు, ఆనందరాజు అనే స్నేహితుణ్ణి లక్ష్మిపురం రావలసిందిగా ఆహ్వానించాడు. ఆనంద రాజు, జమీందారు ఇంట ఒక వారం రోజులు గడిపి, ఒక ఉద్యోగిని వెంట బెట్టుకుని, జమీందారుగారి వ్యవసాయ క్షేత్రాలు చూస్తూ కృష్ణాపురం వచ్చాడు.



ఆయన, అరక కడుతున్న దున్నపోతులను చూసి వెంకయ్యతో, "ఇవి, చిన్నప్పటినుంచీ నీ సంరక్షణలో పెరిగినవే కదా? బలానికి యీ చుట్టుపక్కల బాగా పేరు మోసినట్టు విన్నాను." అన్నాడు.

ఆ మాటలకు వెంకయ్య పొంగిపోయి, "నోరులేని పశువులుగదా, బాబూ! వాటి అవసరాలు మనమే గమనిస్తుండాలి, నాకు అంతగా దివాణానికి వెళ్ళవలసిన పనులుండవు. ఈ దున్నల్నే, నా దివాణం అనుకుని ప్రాణంతో సమానంగా చూసుకుంటున్నాను," అన్నాడు.

ఆ సమయంలో ఆనందరాజు వెంట వున్న కొమరయ్య చాలా చిరాకుపడ్డాడు. అతను, ఆనందరాజు వెంట జమీందారు దగ్గిరకు పోయి, "బావగారూ, ఆ పాలేరు వెంకయ్య మన దివాణం గురించి నోటికి వచ్చిందల్లా వాగేస్తున్నాడు. వాడి దృష్టిలో దున్నపోతులకూ, దివాణానికీ తేడా ఏమీ లెదు. ఈ ఆనందరాజుగారినే అడగండి," అన్నాడు.

ఆనందరాజు, వెంకయ్యతో జరిగిన సంభాషణ జమీందారుకు చెప్పాడు.

జమీందారు చాలా సంతోషంగా, "వెంకయ్య, యీ మాటలు నాతోనే లోగడ ఒకటి, రెండుసార్లు అన్నాడు. దున్నపోతులను దివాణం అనుకుంటూ, వాటి పోషణ అంత జాగ్రత్తగా చూస్తున్నాడంటే, వాడెంతటి విశ్వాసపాత్రుడో నువ్వే ఆలోచించు. మా దివాణంలో ఎడాపెడా దొంగతిండ్లుతింటూ వీలైతే దొంగలెక్కలు రాసే దున్నపోతులు కొన్నివున్నవి. ఈ దొంగదున్నలంటే నాకు చాలా అసహ్యం; కొంచెం భయంకూడా," అన్నాడు.

తరవాత ఆయన కొమరయ్యతో, "కృష్ణాపురం చేరగానే, నా బహుమానం అని చెప్పి, వెంకయ్యకు పాతిక రూపాయిలు యివ్వండి," అన్నాడు.

తన ఎత్తు పారకపోగా, వెంకయ్యకు మరొక పాతిక రూపాయిల బహూమానం ముట్టుతున్నందుకు కొమరయ్య దిగాలు పడిపోయాడు





# గురువు బాధ్యత

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్వుడు తక్షశిలా నగరంలో ఒక గొప్ప శిల్పాచార్యుడుగా జన్మించాడు. ఆయన వద్ద శిల్పవిద్య అభ్యసించటానికి దేశం నాలుగు మూలల నుంచీ, అనేక మంది రాజకుమారులు వస్తూండేవాళ్ళు.

తక్షశిలా నగరపు శిల్పాచార్యుడి ఖ్యాతి విని కాశీరాజు తన కుమారుణ్ణి కూడా విద్యాభ్యాసానికి గాను, ఆయన వద్దకు పంపటం మంచిదని నిర్ణయించాడు.

పదహారేళ్ళయినా సరిగా నిండని రాజకుమారుడు ఒంటరిగా, దూరాన వున్న తక్షశిలకు వెళ్ళి, అక్కడ గురుశుశ్రూష చేసి విద్య అభ్యసించటం మంత్రులకూ, సామంతులకూ యిష్టం లేకపోయింది.

''మహారాజా, శిల్పవిద్యలో విద్వాంసులైన వారు మన నగరంలోనే వున్నారు గదా. యువరాజును తక్షశిలకు పంపడం దేనికి?'' అన్నారు వాళ్ళు.

రాజు యీ సలహా ఆమోదించలేదు. యిక్కడ తన రాజధానీ నగరంలో, తన కుమారుడు యువరాజు హోదాలో శిల్పవిద్య నేర్చుకోవడం సాధ్యపడదని ఆయన అభిప్రాయ పడ్డాడు.

ఇలా ఆలోచించి రాజు, తన కుమారుడికి ఒక జత ఆకుజోళ్ళూ, ఒక తాటాకు గొడుగు మాత్రం యిచ్చి, ''నువు తక్షశిలా నగరానికి వెళ్ళి, అక్కడి శిల్పాచార్యుడి వద్ద విద్యాభ్యాసం చేసి, విద్య పూర్తి కాగానే తిరిగిరా! ఆయనకు గురుదక్షిణగా యివ్వటానికి వెయ్యి వెండి కాసులు వెంట తీసుకుపో,'' అన్నాడు.

రాజకుమారుడు తండ్రి ఆజ్ఞ ప్రకారం ఒంటరిగా బయలుదేరి, వెయ్యి కాసులు గల మూట మోస్తూ, అలసిపోయినప్పుడు



ఏ చెట్టు కిందనో విశ్రమిస్తూ, నానా అగ చాట్లు పడి, తక్షశిల చేరాడు.

అక్కడ అతడు శిల్పాచార్యుణ్ణి దర్శించి, తాను వచ్చిన పని చెప్పి, ఆయనకు వెయ్యి వెండికాసులూ గురు దక్షిణగా యిచ్చి, ఆయన వద్ద విద్యాభ్యాసం ప్రారంభించాడు. అతడి శిల్ప విద్య బాగానే సాగింది. అతడి తెలివి తేటలకు గురువు చాలా సంతోషించాడు.

కొంతకాలం గడిచింది. గురు శిష్యులు ప్రతి ఉదయమూ ఊరి వెలపల వున్న నదికి వెళ్లి స్నానం చేసి వస్తూండేవారు. ఒకనాడు వారు స్నానంచేసే సమయంలో, ఒక ముసలమ్మ కొన్ని నువ్వులు తెచ్చి, నీటిలో కడిగి శుభ్రం చేసి, నది ఒడ్డున వస్త్రం పరిచి, దానిమీద ఆరబోసింది.

రాజకుమారుడు నువ్వులను చూసి, చప్పున స్నానం ముగించి ఒడ్డుకు వచ్చి, ముసలావిడ పరధ్యానంగా వున్నట్టు కన బడిన సమయంలో, గుప్పెడు నువ్వులు తీసి నోట పోసుకున్నాడు.

అయితే, ముసలమ్మ యిది గమనించింది, కాని ఏమీ అనలేదు.

మర్నాడు కూడా అలాగే జరిగింది. మళ్ళీ ముసలమ్మ చూసి చూడనట్టు వూరుకున్నది. మూడోనాడు కూడా అలాగే జరిగింది. కుర్రవాడి దొంగబుద్ధి చూసి ముసలమ్మకు కోపం వచ్చింది.

ఆమె, శిల్పాచార్యుడు స్నానం ముగించి ఒడ్డుకు రాగానే, "చూడండి, మూడు రోజులుగా మీ శిష్యుడు నా నువ్వులు అపహరించి తింటున్నాడు. నువ్వులు పోయాయని నాకు విచారం లేదు గాని, అతను దొంగబుద్ధులు అల వరుచుకోవటం అతనికీ మంచిది కాదు, మీ కీర్తికీ మంచిది కాదు. ఇలా ఎన్నడూ చేయకుండా శిక్షించండి," అన్నది.

ఇంటికి వెళ్ళగానే శిల్పాచార్యుడు, రాజకుమారుడి చేతులు గట్టిగా పట్టుకోమని మిగిలిన శిష్యులకు చెప్పి, అతడి వీపు మీద బెత్తంతో మూడు దెబ్బలు

కొట్టి, "కూడని పని చేసినందుకు, నీ కిది శిక్ష! ఇక ఎన్నడూ చెయ్యకు," అన్నాడు.

రాకుమారుడికి గురువు మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది. అయితే, అతను కాశీ రాజ్యం పొలిమేరల లోపల రాజకుమారుడు గాని, ఇక్కడ సామాన్య వ్యక్తి. దండించే అధికారం గురువుకున్నది.

"నేను రాజునయాక, యీ దుర్మార్గుణ్ణి ఏదో మిష మీద కాశీ రాజ్యానికి పిలిపించి, తప్పక ప్రాణాలు తీస్తాను!" అని రాజకుమారుడు అక్కసుకొద్దీ మనసులో శపథం చేసుకున్నాడు.



కాలక్రమాన రాజకుమారుడి చదువు పూర్తయింది. అతడు కాశీకి తిరిగి వెళ్లిపోతూ గురువుకు నమస్కరించి, ఆయన ఆశీర్వాదం పొందాడు.

తరవాత అతను గురువుతో, "ఆర్యా, నేను రాజునయాక తమరు ఒకసారి తప్పక కాశీనగరానికి దయ చెయ్యాలి. అప్పుడు నేను తమరిని యథోచితంగా సత్కరిస్తాను," అన్నాడు.

శిష్యుడి ఆహ్వానానికి గురువు చాలా సంతోషించి సరేనన్నాడు.

కాశీరాజ్యానికి తిరిగి వెళ్ళిన కొంత కాలానికి రాజకుమారుడు రాజ్యాభిషిక్తుడయాడు. ఒకనాడతనికి తన గురువు విషయం జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతడు ఒక నౌకరును పిలిచి, "నువు తక్షశిలా నగరం వెళ్లి, శిల్పాచార్యుణ్ణి కలుసుకుని, ఆయనకు యీ ఆహ్వాన పత్రిక అందజెయ్యి!" అన్నాడు.

శిల్పాచార్యుడు ఆహ్వానం అందుకుని కూడా వెంటనే బయలుదేరలేదు. రాజు సింహాసనం ఎక్కిన మోజులో వుంటాడు. రాజ్యభారం ఎలాంటిదో తెలిసివచ్చాక చూద్దామనుకున్నాడు.

ఆ ప్రకారమే శిల్పాచార్యుడు కొంత కాలం గడిచాక, కాశీనగరానికి వెళ్ళి, రాజప్రాసాదంలో వున్న శిష్యుణ్ణి చూడబోయాడు. రాజుగారి గురువు వచ్చాడని సభాసదులు శిల్పాచార్యుడికి చాలా

మర్యాద చూపించి, ఉన్నతాసనం యిచ్చారు.

గురువును చూసిన క్షణం నుంచీ రాజుకు పాత పగ జ్ఞాపకం వచ్చి కోపం పొంగిపోతున్నది. అతడు మాటల మధ్యలో గురువు కేసి తీక్షణంగా చూస్తూ, "ముష్టి నువ్వులు పిడికెడు తిన్నందుకు శిక్షించిన వాణ్ణి, చేతికి అందినప్పుడు చంపకుండా వదిలిపెడతారా?" అని అడిగాడు.

సభలో ఇంకెవరికీ అర్థంకాకుండా, శిల్పాచార్యుడికి చావుభయం కలిగించి, తరవాత వీలువెంట ఆయనను చంపేద్దామని రాజు ఉద్దేశించాడు.

అయితే, రాజు అనుకున్నట్టు శిల్పాచార్యుడు బెదరలేదు. పైపెచ్చు ఆయన యీ విధంగా రాజు రహస్యం బయటపెట్టేశాడు:

"ఓ రాజా! నువు నా దగ్గిర శిష్యుడవుగా, నా బాధ్యత కింద వున్న సమయంలో నీ తాహతుకు తగని పని చేశావు. శిష్యుడి దుష్ప్రవర్తనను దండించి, సన్మార్గంలో పెట్టటం గురువు విధి. నిన్నా నాడు నేను దండించి వుండకపోతే, నువ్వీ పాటికి కాశీరాజ్యానికి రాజుగా వుండటానికి మారుగా, దొంగవై వుందువు. బుద్ధిమంతులైనవారు, తప్పుచేసినప్పుడు దండించిన వారిపై ఎన్నడూ ఆగ్రహం చెందరు, కృతజ్ఞత చూపుతారు!" అన్నాడు శిల్పాచార్యుడు.

అసలు విషయం సభవారందరికీ తెలిసిపోయింది. రాజుకు అవమానం అయింది. అతడు సింహాసనం దిగి గురువు కాళ్ళపై బడి, "మహానుభావా, మళ్ళీ తప్పుదారిన పడిన నా మనస్సును సరి అయిన దారిన పెట్టారు, కృతజ్ఞుణ్ణి!" అన్నాడు.

రాజులో వచ్చిన మంచి మార్పుకు, సభాసదులతోపాటు గురువు కూడా ఎంతగానో ఆనందించాడు.

రాజు కోరికపై శిల్పాచార్యుడు తన కాపురం తక్షశిల నుంచి కాశీకి మార్చి, ఆస్థాన ఆచార్యుడుగా వుంటూ, రాజును సరిఅయిన మార్గాన నడిపించాడు.



# పృథ్వీరాజు - సంయుక్త-2



మునలి దాది కనూజ్ చేరి, ముందు సంయుక్త చెలికత్తెలను పరిచయం చేసుకున్నది. వాళ్ళామెను సంయుక్త దగ్గిరకు తీసుకుపోయారు. దాది వాక్చాతుర్యం, మంచితనం సంయుక్తను బాగా ఆకర్షించాయి.

దాది సంయుక్తకు పరిచర్యలు చేసేటప్పుడు వీలుచూసుకుని, పృథ్వీరాజు వీరకృత్యాలను గురించి ఆమెకు చెప్ప సాగింది. ఈ విధంగా కొద్దిరోజుల్లోనే సంయుక్తకు పృథ్వీరాజుపై అనురాగం ఏర్పడింది.






తాను వచ్చేటప్పుడు దాది పృథ్వీరాజు చిత్రపటం ఒకటి వెంటతెచ్చింది. సంయుక్తకు ఆ చిత్రపటాన్ని చూస్తూంటే, లోగడ తాను అతణ్ణి అజ్మీర్ రాజభవనంలో చూసిన జ్ఞాపకాలు తిరిగి గుర్తుకు రాసాగాయి. ఆమె, పృథ్వీరాజును తప్ప మరెవరినీ వివాహమాడరాదని నిశ్చయించుకున్నది.



రాజు జయచంద్రుడు వార్తాహరుల ద్వారా, వివాహ యోగ్యులైన రాజకుమారులకు సంయుక్త స్వయంవరాన్ని గురించి తెలియబరిచాడు. కనూజ్ నగర పౌరులు ఎంతో ఉత్సాహంతో స్వయంవర దినం కోసం ఎదురుచూడసాగారు.

స్వయంవరానికి చాలామంది రాజకుమారులు వచ్చారు. సంయుక్త చెలికత్తెలు మంత్రుల ద్వారా, పృథ్వీరాజు స్వయంవరానికి ఆహ్వానింపబడలేదని తెలుసుకున్నారు. ఆ సంగతి వాళ్ళు సంయుక్తకు చెప్పారు.





సంయుక్త చెలికత్తెలు జయచంద్రుడితో, పృథ్వీరాజును కూడా ఆహ్వానించవలసిందిగా ఆమె కోరినట్టు చెప్పారు. అందుకు జయచంద్రుడు హేళనగా, "అతను కూడా ఏదో రూపంలో తప్పకుండా స్వయంవరానికి హాజరయ్యేలా చూస్తాను!" అన్నాడు. తన తండ్రికి పృథ్వీరాజుపై వున్న శత్రుభావం ఎరిగిన సంయుక్త విచారగ్రస్థురాలైంది.

చెలికత్తెల వెంట స్వయంవర మంటపానికి పోతూ సంయుక్త ద్వారం వద్ద వున్న పృథ్వీరాజు ప్రతిమను చూసింది. అది ద్వారం కాపలావాడి దుస్తులతో, అలంకరణతో వున్నది. సంయుక్త ఒక్క క్షణకాలం నిర్ఘాంతపోయి, ఆ మరు క్షణంలోనే ఒక దృఢనిశ్చయానికి వచ్చింది.





వలయాకారంగా వున్న స్వయంవర మంటపంలో ఆసీనులై, మందహాసాలతో ఆహ్వానిస్తున్న రాజకుమారులను ప్రధాన చెలికత్తె సంయుక్తకు పరిచయం చేసింది. ఆమె వలయంలో ఒక చుట్టు తిరిగింది. కాని, వరమాలను ఎవరి మెడలోనూ వేయలేదు.

స్వయంవర మంటపం నుంచి సంయుక్త బయటికి పోవడం చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. కారణం ఎవరికీ అర్థం కాలేదు. అంతలో సంయుక్త ద్వారం దగ్గిర వున్న పృథ్వీరాజు ప్రతిమ మెడలో వరమాల వేసి, నమస్కరించింది.





ఆ మరుక్షణం ఎవరూ ఊహించని సంఘటన జరిగింది. ప్రేక్షకుల వెనక నుంచి ఒక గుర్రపు రౌతు మెరుపు వేగంతో సంయుక్త ముందుకు వచ్చి, గుర్రం దిగి, ఆమెతో రహస్యంగా ఏదో అన్నాడు. సంయుక్త చిరునవ్వుతో తలాడించింది.

అందరూ నిర్విణ్ణులై చూస్తున్నంతలో సంయుక్త గుర్రం ఎక్కి కూర్చున్నది. ఆ వెంటనే రౌతు ఒక్క ఉదుటున గుర్రం మీదికి పోయాడు. అతడు మారువేషంలో వున్న పృథ్వీరాజు! జనం తెప్పరిల్లేలోపల పృథ్వీరాజు గుర్రాన్ని అదిలించి సంయుక్తతో ఆ ప్రదేశం వదిలిపోయాడు.





జయచంద్రుడు పట్టరాని కోపంతో, "ఆ ఇద్దర్నీ బంధించండి!" అంటూ అరిచాడు. రాజాజ్ఞ వింటూనే చాలా మంది అశ్వికులు పారిపోతున్న పృథ్వీరాజు వెంటబడ్డారు. పెద్ద గగ్గోలు రేగింది. సంయుక్త భయకంపితురాలైంది. —(వచ్చే సంచికలో ముగింపు)

# ప్రాణభయం

రాజుగారి శయనగృహం నుంచి, ఆయన అపురూపంగా ధరించే వజ్రకంకణం పోయింది. అంతఃపురం కాపలా వాళ్ళు ముగ్గురున్నారు. రాజు వాళ్ళను ఎంత కఠినంగా ప్రశ్నించి, భయ పెట్టినా, తాము కంకణం సంగతి ఎరగమన్నారు.

రాజు కోపం పట్టలేక తలారిని పిలిపించి, ముగ్గురు కాపలావాళ్ళ తలలూ నరకమన్నాడు. అంతలో అక్కడికి మంత్రి వచ్చి, సంగతి తెలుసుకుని, "మహారాజా, ఈ ముగ్గురిలో ఒక్కడే దొంగ! వాడి నేరానికి అమాయకులైన మరి యిద్దరి తలలు నరికించడం ధర్మం కాదు. దొంగ ఎవరో నాకు తెలుసు," అన్నాడు.

"అయితే, ఆ దొంగ తలే తక్షణం నరికించండి!" అన్నాడు రాజు.

మంత్రి కాపలా వాళ్ళతో, "తలారి చేతికత్తి చూసి, అలా వణికిపోకండి. వాడు మీలో వజ్రకంకణం దొంగిలించిన వాడి తలే నరుకుతాడు! ముగ్గురూ తలలు వంచుకుని, ఆఖరిసారిగా దైవప్రార్థన చేసుకోండి," అన్నాడు.

కాపలావాళ్ళు ముగ్గురూ తలలు వంచుకున్నారు. కాని, వాళ్ళల్లో గంగన్న అనేవాడు మాత్రం మధ్య, మధ్య తల ఎత్తి తలారికేసి చూడసాగాడు. మంత్రి వాణ్ణి రాజుకు చూపుతూ, "మహారాజా, వీడే అసలు దొంగ!" అన్నాడు.

రాజు భటులను పంపి గంగన్న ఇంటిలో వెతికించగా వజ్రకంకణం దొరికింది. ఆయన మంత్రిని మెచ్చుకుని, కాపలా గంగన్నకు ఖైదు శిక్ష వేశాడు. —ఎం. శ్యాంసుందర్‌రావు





# గుణపాఠం

విజయనగరానికి వెళ్ళే దారిలో, తెల్లటి పొడవాటివెంట్రుకలతో నిగనిగలాడుతున్న ఒక కుక్కను వెంటబెట్టుకుపోతున్న నలభై ఏళ్ళ వయసువాడొకడు, ఎల్లప్పకు తారసపడ్డాడు.

మాటల సందర్భంలో ఎల్లప్ప అతడికి, తాను కూతురు పెళ్ళికి నగలు కొనబోతున్నట్టు చెప్పి, అతణ్ణి కుక్కతో యీ ప్రయాణం ఏమిటని అడిగాడు.

"నా పేరు భద్రయ్య. ఇది, నా పెంపుడు కుక్క. నగరంలో చాలా ముఖ్యమైన పని వుండి వెళుతున్నాను," అన్నాడు కుక్క యజమాని.

కుక్క అందం చూసి ముచ్చటపడిన ఎల్లప్ప, అలా అడగడం మర్యాద అవునా కాదా అని ఆలోచించకుండా, "కుక్కను అమ్ముతావా? ఏపాటి ధర?" అని అడిగాడు.

భద్రయ్య ఆ ప్రశ్నకు ఆశ్చర్యపోయి, ఎల్లప్ప కేసి పరీక్షగా ఓమారు చూసి, "సరే, అమ్ముతాను. వెయ్యి వరహాలు," అన్నాడు.

"వెయ్యి వరహాలే! అంత దురాశ మంచిదికాదు. కుక్క అందంగానే వున్నదనుకో, అయినా ఐదారు వరహాలకంటె ఎక్కువ చెయ్యదు," అన్నాడు ఎల్లప్ప కోపంగా.

"ఆశో, దురాశో, నా కుక్క ఖరీదు వెయ్యి వరహాలు!" అంటూ రెట్టించాడు భద్రయ్య.

"నువు చెప్పే అంత పెద్ద ధరకు ఏ తలమాసినవాడో కాదు గదా, ఆఖరికి వెర్రివెంగళాయ కూడా కొనడు," అన్నాడు ఎల్లప్ప.

"అలాగా! అయితే, పందెం వేస్తావా మరి? దీన్ని నువు చూస్తూండగానే వెయ్యి

మల్లాది వెంకటకృష్ణమూర్తి

వరహాలకు అమ్ముతాను,'' అన్నాడు భద్రయ్య.

''అలాగే, పందెం! నువ్వు ఆ ధరకు అమ్మగలిగితే, నూరు వరహాలు యిస్తాను. అమ్మలేకపోయావో, నువ్వు నాకు నూరు వరహాలు యిచ్చుకోవాలి,'' అన్నాడు ఎల్లప్ప రోషంగా.

ఇద్దరూ విజయనగరంలోని ఒక పెద్ద బజారు చేరుకున్నారు. కుక్కను అమ్మ చూపిన భద్రయ్యను, దాని ఖరీదెంత అని యిద్దరు ముగ్గురు అడిగారు. వెయ్యి వరహాలని భద్రయ్య చెప్పగానే, వాళ్లు కుక్కకేసీ, భద్రయ్యకేసీ వింతగా చూసి, వీడేదో పిచ్చివాడనుకుంటూ, మారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

''చూశావా! కుక్క అమ్మకం దేవుడెరుగు. అందరూ నిన్ను వెర్రివాడి కింద జమకట్టేస్తున్నారు,'' అన్నాడు ఎల్లప్ప ఉత్సాహంగా.

''తొందరపడకు. నా కుక్కను వెయ్యి వరహాలకు అమ్మి తీరుతాను,'' అంటూ భద్రయ్య, వీధివారగా పంజరాల్లో చిలకలను పెట్టి అమ్ముతున్న ఒకడి దగ్గిరకు వెళ్ళాడు.

''నా కుక్కలాగే, యీ చిలకలూ ఏదో దేవతాజాతివిలా వున్నవి. చిలక ఖరీదెంతేమిటి?'' అని అడిగాడు భద్రయ్య చిలకలమ్మే వాణ్ణి.

''ఒక్క వరహా!'' అన్నాడు చిలకలమ్మేవాడు.



''అంత చవకా! నువ్వేదో ఒట్టి అమాయకుడిలా వున్నావు. ఒక్కొక్క చిలకను ఐదు వందల వరహాలకు కొంటాను; అమ్ముతావా?'' అన్నాడు భద్రయ్య పంజరంలో నుంచి రెండు చిలకలను చేతిలోకి తీసుకుంటూ.

''ఏమిటీ! చిలకను ఐదు వందల వరహాలకు కొనబోతున్నావా? నీకేం మతి సొంతం పోలేదు గద,'' అన్నాడు ఎల్లప్ప ఆశ్చర్యపోతూ.

భద్రయ్య ఆ మాటలు ఏమాత్రం పట్టించుకోలేదు.

అతడు కుక్కను చిలకలమ్మే వాడికి చూపుతూ, ''ఈ కుక్క ఖరీదు వెయ్యి వరహాలు. డబ్బుకు బదులుగా దీన్ని తీసుకో,'' అన్నాడు.

రెండు చిలకలను అమ్మితే వచ్చే రెండు వరహాల కన్న, యీ కుక్కను అమ్మితే మరికాస్త ఎక్కువ డబ్బు వస్తుందనుకుని, చిలకలమ్మేవాడు మారుపలక్కుండా కుక్కను తీసుకున్నాడు.

భద్రయ్య, ఎల్లప్ప కేసి తిరిగి, ''చూశావా, నీ కళ్ళ ఎదటే కుక్కను వెయ్యి వరహాలకు అమ్మాను. పందెం డబ్బు నూరు వరహాలూ యిచ్చుకో,'' అన్నాడు.

ఎల్లప్ప దిగాలు పడిపోతూ, భద్రయ్యకు నూరు వరహాలు యిచ్చాడు. భద్రయ్య తాను కొన్న చిలకలను, దాపుల వున్న చెట్లమీదికి వదిలిపెట్టి, ఎల్లప్పతో, ''తెలిసిందా, అమ్మచూపని దానిమీద మోజుపడి, 'దురాశకొద్దీ ఎంత నష్టపోయావో! ఇది చిన్న నూరు వరహాల గుణపాఠమే గదా అని మరిచిపోతే మరోసారి వెయ్యి వరహాలు నష్టపోయే ప్రమాదం కలగవచ్చు,'' అన్నాడు.

ఎల్లప్ప తలవంచుకుని వీధివెంట కొంత దూరం పోయినదాకా ఆగి, భద్రయ్య చిలకలమ్మేవాడి చేతిలో పది వరహాలు పెట్టి, తన కుక్కను తీసుకుని, మిగిలిన తొంభై వరహాల లాభంతో తన దారిన తాను పోయాడు.





# దేవతలైన దయ్యాలు

పోలవరం ఊరి చివర మర్రిచెట్టు మీద చాలా దయ్యాలు కాపురముండేవి. ఒక రోజున కొత్త దయ్యం ఒకటి ఆ చెట్టు దగ్గిరకు వచ్చింది.

''ఇప్పటికే ఈ చెట్టు యిరుకైపోయింది. నువ్వు పోయి మరేదైనా చెట్టు చూసుకో !'' అంటూ మర్రిచెట్టు మీది పెద్ద దయ్యం, కొత్త దయ్యాన్ని అదిలించింది.

''ఎక్కడికి పోయేది ? దగ్గిర్లో ఎక్కడా మరొక మర్రిచెట్టు కనబడడం లేదు,'' అంటూ కొత్త దయ్యం దీనంగా ముఖం పెట్టింది.

''అయితే, మనుషుల మధ్యకు పోయి వుండరాదూ !'' అన్నదొక దయ్యం.

''మనుషులతో వేగడం మహాకష్టం. ఇంట్లో దయ్యముందని అనుమానం వచ్చిందంటే, మంత్రగాళ్ళను పిలుస్తారు. వాళ్ళు పెట్టే బాధ భరించలేకే, నే నిలా పారిపోయి వచ్చాను. మర్రిచెట్టు గాలి తప్ప మరేదీ పడదు, నాకు,'' అన్నది కొత్త దయ్యం.

చెట్టు మీది దయ్యాల్లో కాస్త ఉపకార బుద్ధి గల దయ్యం ఒకటున్నది. అది కొత్త దయ్యం మీద జాలిపడి, ''సరేలే పోనీ, కొన్నాళ్ళపాటు నువ్వీ చెట్టు మీద వుండు. నేను పోయి మనుషుల మధ్య వుండి వస్తాను,'' అంటూ గాలిలోకి ఎగిరి, ఊరు చేరి, ఒక ఇంట్లో ప్రవేశించింది.

ఆ ఇంటి యజమాని పోలయ్య. ఆయనకు భార్యా, యిద్దరు కొడుకులు. కొడుకు లిద్దరికీ పెళ్ళిళ్ళయి, కోడళ్ళు కాపరానికి వచ్చారు. పెద్దకొడుక్కు మూడేళ్ళ బాబు కూడా వున్నాడు.

దయ్యానికి ఆ ఇంట్లో ఏమీ శ్రమ అనిపించలేదు. తానెవరికీ కనిపించదు కనక, ఎక్కడ కావాలంటే అక్కడ తిరగ

"వసుంధర"



వచ్చు. మర్రిచెట్టు కంటే, ఆ ఇల్లే దాని కెంతో సదుపాయంగా వున్నది. ఆ ఇంట్లో వాళ్లు సరదాగా కబుర్లు చెప్పుకుంటూంటే, దయ్యం తానూ విని ఆనందించేది. పోలయ్య మనవడి ముద్దుచేష్టలు దానికి వినోదం కలిగించేవి. ఇక, ఆ యిల్లు వదలరాదనుకున్నది, దయ్యం.

ఇలా ఒక నెలరోజులు దయ్యానికి హాయిగా జరిగిపోయింది. ఒక రోజున ఇంట్లోని ముగ్గురాడవాళ్ళూ కబుర్లలో పడ్డారు.

చిన్నకోడలు అత్తగారిని మెచ్చుకుంటూ, ''మన పొరుగింటావిడ కోడల్ని దయ్యంలా వేధిస్తున్నది. మా అదృష్టం కొద్దీ, మీరు మాకు అత్తయ్యగా దొరికారు,'' అన్నది.

''ఆ పొరుగింటావిణ్ణి దయ్యంతో పోలుస్తావెందుకే? దయ్యాలు ఆవిడకంటె చాలా మెరుగు!'' అన్నది పెద్దకోడలు.

ఇందుకు అత్తగారు నవ్వుతూ, ''దయ్యాలు మెరుగంటున్నావు. నీకు వాటి గురించి బాగా తెలుసేమిటి?'' అన్నది.

''ఆс, తెలుసు కాబట్టే చెప్పాను! మనం దయ్యాల్ని మెచ్చుకుంటే, అవి పనులు చేసిపెట్టే అవకాశం వుంది. పొరుగింటావిడ ఎంత పని చేసినా కోడల్ని సాధిస్తూనే వుంటుంది,'' అన్నది పెద్ద కోడలు.

''మరి నువ్వు దయ్యాన్ని మెచ్చుకున్నావు గదా! ఈ రోజు నీ వంతు రెండు గుండిగల నీళ్ళూ అదే తోడుతుందంటావా?'' అన్నది చిన్నకోడలు.

''ఏమో, ఎవరు చెప్పగలరు? మనం నిద్రపోయి లేచేసరికి, అలా జరిగినా జరగొచ్చు,'' అన్నది పెద్దకోడలు.

ఆ తర్వాత అందరూ నిద్రపోయారు. ఈ సంభాషణ విన్న దయ్యానికి, తనను మెచ్చుకున్న పెద్దకోడలంటే అభిమానం ఏర్పడింది. ఆమెకు దయ్యాల మీద గల సానుభూతిని నిజం చెయ్యాలనుకుని,

మర్నాడు పెద్దకోడలు నిద్ర లేచేసరికి, రెండు గుండిగల్నీ నీళ్లతో నింపింది.

పెద్దకోడలు నూతిగట్టు వద్దకు వెళ్ళి, రెండు గుండిగల నిండా నీళ్ళుండడం చూసి, ఆశ్చర్యపోతూ అత్తగార్నీ, చిన్న కోడల్నీ పిలిచి, "మీరేమైనా నీళ్ళు తోడారా?" అని అడిగింది.

ఇద్దరూ తోడలేదన్నారు. చిన్నకోడలు ఒకక్షణం వూరుకుని, "రాత్రి మామగారు మన మాటలు విని, మనని ఆటపట్టించేందుకు, యీ పని చేశారేమో," అన్నది.

అయితే, పోలయ్యా, అతడి యిద్దరు కొడుకులూ నూతి దగ్గిరకే రాలేదన్నారు.

"కొంపతీసి, ఏ దయ్యమో యీ పని చేయలేదు గదా!" అన్నది చిన్నకోడలు.

"దయ్యాల కిలాంటి ఉపకారబుద్ధి వుండదు. తమాషా కోసం మనలోనే ఎవరో ఈ పని చేసివుంటారు," అంటూ పోలయ్య అందరి ముఖాల కేసీ పరీక్షగా చూశాడు.

పోలయ్య పెద్దకొడుకు మాత్రం తాపీగా, "ఇది నిజంగా ఉపకారబుద్ధి గల దయ్యం పనే అయితే, యింత చిన్న సహాయంతో ఎందుకు ఊరుకోవాలి, మన ఇంటి కప్పు నేసిపెట్టకూడదూ? పెంకు తిరగవేసి నాలుగేళ్ళయింది; ఇంట్లో అక్కడక్కడా వాన కురుస్తున్నది కూడా," అన్నాడు.

తన సేవకు గుర్తింపు లభించలేదని దయ్యానికి చాలా బాధ కలిగింది. అది ఆ రాత్రి ఇంటి కప్పు మీది పెంకులన్నీ చక్కగా సర్ది పెట్టింది.





మర్నాడు తెల్లవారి లేస్తూనే, అంతా తనను మెచ్చుకుంటారని దయ్యం ఆశగా ఎదురు చూసింది. అయితే, పోలయ్య నిద్రలేస్తూనే ఒక గావు కేకపెట్టి పడిపోయాడు. ఆయన యిద్దరు కొడుకులూ కంగారుపడి వైద్యుణ్ణి పిలుచుకు వచ్చారు.

వైద్యుడు పోలయ్యను పరీక్షించి, "ఈయనకు కడుపులో పుండు వున్నది. శస్త్రచికిత్స చేయాలి; కొంచెం బాధాకరంగా వుంటుంది. అది అంతగా తెలియరాకుండా మత్తు మందు యిస్తాను," అన్నాడు

తరవాత శస్త్రచికిత్స చేసి, మత్తు మందు యిచ్చి వెళ్ళిపోయాడు. దయ్యం యిదంతా చాలా ఆశ్చర్యపోతూ చూసింది. పోలయ్య త్వరగా కోలుకుంటే తప్ప, ఇంట్లో వాళ్ళకు తన మంచితనం గురించి తెలియదని నిరుత్సాహపడింది.

నాలుగు రోజులు గడిచినై. బాధ అనిపించినప్పుడల్లా పోలయ్య మత్తు మందు వేసుకుని నిద్రపోయేవాడు. ఈ గొడవలో ఇంట్లో వాళ్ళెవరూ, కప్పుమీది పెంకునేత గమనించలేదు.

ఒకరోజున పెద్ద వాన ప్రారంభమయింది. పోలయ్య మంచం మీద లేచి కూర్చుని, కొడుకులతో, "ధాన్యం గది జాగ్రత్త! అది తడిసిపోవడం జరిగితే, మనం తిండికి అవస్థపడవలసి వస్తుంది," అంటూ కేకలు పెట్టాడు.

అందరూ ఇంట్లో తలా ఒకచోటుకు వెళ్ళి చూశారు. పూర్వంలాగా ఎక్కడా కప్పులో నుంచి వాన చినుకులు పడడం లేదు. వాళ్లు ఆశ్చర్యపోయి, యీ సంగతి పోలయ్యకు చెప్పారు.

"కొంపదీసి యిది దయ్యం పని కాదు గదా!" అన్నాడు పోలయ్య.

అప్పుడు అందరికీ పోలయ్య పెద్ద కొడుకు దయ్యాన్ని గురించి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. వాన తగ్గిన తరవాత వెళ్ళి చూస్తే, ఇంటి మీది పెంకు చక్కగా పేర్చి వుంది.

కోడళ్ళిద్దరూ హడలిపొయ్యారు. "ఈ ఇంట్లో నిజంగానే దయ్యం చేరింది!" అంటూ అత్త గోల పెట్టింది.

"మంత్రాల మరిడయ్యను పిల్చుకు వస్తాను," అంటూ పెద్ద కొడుకు ఊళ్ళోకి వెళ్ళాడు.

తను ఇంటి వాళ్ళందరికీ ఉపకారం చేస్తే, వాళ్ళు అంతగా ఎందుకు భయ పడిపోతున్నారో అర్థంకాక, దయ్యం మళ్లీ మర్రిచెట్టు దగ్గిరకు వెళ్ళింది.

"ఛీ!. ఛీ! ఇక్కడ ఖాళీ లేదని తెలియదా. ఏం?" అంటూ ఒక దయ్యం పెద్దగా విసుక్కున్నది.

ఇంటి దయ్యం, ఆ దయ్యాన్ని గుర్తు పట్టి. "నువ్వేకదా లోగడ మంత్రగాళ్ళకు భయపడి యిక్కడికి పారిపోయి వచ్చింది! ఇంతకూ, వాళ్ళేం చేస్తారేమిటి?" అని అడిగింది.

"వాళ్ళు మంత్రాలు చదివితే, మనకు ఒళ్ళంతా మంటలు పుడతాయి. ఆ బాధ భరించలేక పారిపోతాం," అన్నది దయ్యం.

"ఓస్, యింతేనా!" అనుకుంటూ పోలయ్య యింటి దయ్యం తిరిగి వచ్చి, వైద్యుడు పోలయ్యకు యిచ్చిన మత్తు మందు కొంచెం మింగి, ఒక మూలగా నిద్రతో జోగుతూ కూర్చున్నది.



తరవాత మంత్రాల మరిడయ్య వచ్చి, కాస్సేపు హడావిడి చేసి ఏవేవో మంత్రాలు చదివాడు. ఎన్ని మంత్రాలు చదివినా వాడికి దయ్యం జాడ తెలియలేదు.

"నేను గొప్ప పిడుగుల్లాంటి మంత్రాలు చదివాను. వాటి ధాటికి ఎంతలేసి దయ్యమూ నిలవలేదు," అని చెప్పి, మరిడయ్య తన బహుమతి తీసుకుని వెళ్ళిపోయాడు.

"దయ్యం నిజంగా ఇల్లొదిలి పారి పోయిందంటావా?" అని చిన్న కోడలు పెద్ద కోడలిని అడిగింది.

"వెళ్ళకపోయిన పక్షంలో, అది యీ రాత్రి గదిలోని ధాన్యాన్నంతా బియ్యం

కింద దంచి తీరుతుంది గదా !'' అన్నది పెద్ద కోడలు.

ఆ సరికి దయ్యానికి మత్తు మందు ప్రభావం దిగిపోవడంతో, యీ మాటలు విని, అది రాత్రికి రాత్రే గదిలోని ధాన్యాన్ని దంచి బియ్యం చేసింది.

మర్నాడు ధాన్యం గదిలోని బియ్యం చూసి, ఇంటిల్లిపాదీ హడలిపోయారు. కొంతసేపటికి పెద్ద కోడలు తేరుకుని, ''ఇన్ని మంచి పనులు చేస్తున్నది దయ్యమై వుండదు. దయ్యమైతే మరి డయ్య మంత్రాలకు పారిపోయి వుండేది. ఈ ఇంటిని ఏదో దేవత కాపాడుతున్నది. ఆ దేవత మనకెన్నడూ అపకారం చెయ్యదు,'' అన్నది.

ఈ మాటలతో అందరికీ ఎక్కడలేని ధైర్యం కలిగింది.

పోలయ్య యింటి దయ్యం ఉత్సాహంగా మర్రిచెట్టు దగ్గరకు వెళ్ళింది.

''మంత్రాల మరిడయ్య తరిమేశాడా?'' అని ఒక దయ్యం అడిగింది.

''అదేం లేదు. మీ అందరికీ హాయిగా ఇళ్ళల్లో వుండే ఉపాయం చెబుదామని వచ్చాను,'' అంటూ పోలయ్య యింటి దయ్యం మత్తుమందును గురించి వాటికి చెప్పింది.

''భలే మంచి ఉపాయం ! ఇకముందు మనం యీ చెట్లను పట్టుకు వేళ్ళాడ నవసరం లేదు,'' అంటూ కొన్ని దయ్యాలు కేకలు వేశాయి.

పోలయ్య ఇంటి దయ్యం వాటిని ఊరుకోమని, ''ఇంతకాలంగా మనం చెడ్డ వాళ్ళమని, నే ననుకునేదాన్ని. మనం దయ్యాలమైనా, మంచి పనులు చేస్తే మనను మనుషులు దేవతలంటారు. మనుషులతోపాటు హాయిగా బతకాలనుకుంటే, మనం మంచి పనులు చేస్తూ దేవతలం అనిపించుకోవాలి,'' అన్నది.

ఆ నాటినుంచీ మంచి పనులు చేసిన దయ్యాలన్నీ దేవత లయ్యాయి ; చెడ్డ పనులు మానలేనివి మాత్రం దయ్యాలుగానే వుండిపోయాయి.





# వ్యత్యాసం

చంద్రాపీడుడు కాంచన నగరపు రాజు. ఆయన వద్ద ధవళముఖు డని ఒక సేవకు డుండేవాడు. ధవళముఖుడు ఏ రోజు కూడా కొలువు నుంచి నేరుగా ఇంటికి వచ్చేవాడు కాడు. ఎక్కడో భోజనం చేసి తాంబూలం వేసుకుని, బాగా పొద్దు పోయింతర్వాత యిల్లు చేరుకునేవాడు.

ధవళముఖుడి భార్య ఒకరోజు తన భర్తను, "ఏమండీ, మీరు ప్రతిరోజూ ఎక్కడో భోజనం చేసి వస్తారు గదా, ఎవరు మీకు భోజనం పెడతారు? ఎందుకు పెడతారు?" అని అడిగింది.

ధవళముఖుడు భార్యతో, "నాకు ఇద్దరు మంచి స్నేహితులున్నారు. అందులో ఒకడు కల్యాణవర్మ అనేవాడు. అతడు నాకు తనవద్ద వున్నది యేది కావాలన్నా యిస్తాడు. ఇక రెండోవాడు వీరబాహు అనేవాడు. అతను నాకు ఎలాటి ప్రాణ స్నేహితుడంటే, అవసరమైతే నా ప్రాణానికి తన ప్రాణం అడ్డు వేస్తాడు!" అన్నాడు.

తన భర్తకు అంత గొప్ప స్నేహితులున్నారని విని ధవళముఖుడి భార్య చాలా సంతోషించింది. "ఏమండీ, నాకు మీ మిత్రులను ఒకసారి చూపుతారా?" అని భర్త నడిగింది.

"దానికేం భాగ్యం? రేపు నా వెంట రా! ఇద్దరి యిళ్లకూ వెళ్ళి వద్దాం!" అన్నాడు ధవళముఖుడు.

మర్నాడు ఉదయం భార్యాభర్తలిద్దరూ కల్యాణవర్మ ఇంటికి వెళ్ళారు. అతడు వారిని గొప్పగా సత్కరించాడు.

తరవాత ఆ దంపతులిద్దరూ వీరబాహు ఇంటికి వెళ్ళారు. వారు వెళ్ళేసరికి వీరబాహు ఎవరితోనో చదరంగం ఆడుతున్నాడు. అతను ధవళముఖుడి కేసి

ఒకసారి చూసి, "ఏమోయ్, వచ్చావా ? కూచో !" అని తిరిగి ఆటలో నిమగ్ను డయాడు.

భార్యాభర్తలు కొంచెంసేపు కూచుని, "వెళ్లి వస్తాం !" అన్నారు.

వీరబాహు తల ఎత్తకుండానే, "మంచిది !" అన్నాడు.

ధవళముఖుడితో భార్య, "కల్యాణ వర్మ కన్న ఈ వీరబాహు మీకు ప్రాణ స్నేహితుడని చెప్పారు గదా, ఇతనికన్న అతనే మనని ఎంతో ఆదరంగా చూశాడే?" అన్నది.

"వారిద్దరి మధ్యగల వ్యత్యాసం చూడాలంటే, రేపు నువు యిద్దరి దగ్గిరికీ వెళ్లి, నా మీద రాజుగారికి ఆగ్రహం వచ్చిందని చెప్పు," అన్నాడు ధవళముఖుడు.

ఆ ప్రకారమే ఆమె మర్నాడు ముందుగా కల్యాణవర్మ యింటికి వెళ్ళి అతనితో, "అయ్యా, నా భర్తపై రాజుగారు అలిగారు. మీరు మీ మిత్రుడికి యేమైనా సహాయపడగలరా ?" అని అడిగింది.

కల్యాణవర్మ హడలిపోయి, "అమ్మా, నేను వర్తకం చేసుకునేవాణ్ణి. రాజుగారిని ఎదిరించి నే నేం చెయ్యగలను ? నీ భర్త పారిపోవటం మంచిది," అన్నాడు.

ధవళముఖుడి భార్య అక్కడినుండి బయలుదేరి వీరబాహు యింటికి వెళ్ళి అతనితో కూడా అదే మాట చెప్పింది. ఈ మాట వింటూనే వీరబాహు డాలూ, కత్తీ పట్టుకుని ఆమె వెంట బయలుదేరి వచ్చి ధవళముఖుడితో, "మిత్రమా, నీ మీద రాజుకు కోపం తెప్పించిన తుచ్ఛుడెవడో చెప్పు ! వెంటనే ఆ పాపాత్ముణ్ణి హతమార్చుతాను !" అన్నాడు ఆవేశంతో.

ధవళముఖుడు నవ్వుతూ, "కూచోవోయ్. మంత్రిగారు మంచి మాటలతో రాజుగారిని నా పట్ల సుముఖుణ్ణి చేశారులే !" అన్నాడు.

వీరబాహు వెళ్ళిపోయాక ధవళముఖుడు భార్యతో, "చూశావు గదా, నా ఇద్దరు మిత్రులలో గల వ్యత్యాసం !" అన్నాడు.






# విఘ్నేశ్వరుడు

పాండవులు నారదుడు చెప్పిన విధంగానే విఘ్నేశ్వరుణ్ణి భక్తి శ్రద్ధలతో అర్చిస్తూ, ధౌమ్యుడు పురోహితుడుగా గణేశవ్రతాన్ని చేసి, మారు వేషాలతో విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసం జయప్రదంగా ముగించారు.

కృష్ణుని అండతో పాండవులు కౌరవులతో యుద్ధం చేసి విజయం పొందారు. హస్తినాపురంలో ధర్మరాజు పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేస్తూ, అశ్వమేధ యాగాన్ని చేయడానికి తలపెట్టాడు.

యాగాశ్వం వెంట సైన్యసమేతంగా అర్జునుడు బయలుదేరాడు. పాండవుల పురోహితుడైన ధౌమ్యుడు కూడా అతనితో ఉన్నాడు.

యాగాశ్వం అనేక రాజ్యాల మీదుగా వెళ్ళింది. రాజులనేకులు ధర్మరాజు పాలనకు వినయవిధేయతలు ప్రకటించారు. గుర్రం వెళ్తూ, వెళ్తూ ఒక ప్రాంతంలో ఆగిపోయి మరి ముందడుగు వేయలేదు. అర్జునుడు ఆశ్చర్యపోయి ధౌమ్యుణ్ణి ఎందుకిలా జరిగిందని అడిగాడు. ధౌమ్యుడు 'చెపుతా పద' అన్నట్లు చూసి దారి తీశాడు. కొంత దూరం వెళ్ళగా ఒక మహానగరం కనిపించింది. ఆ నగర మధ్యంలో బ్రహ్మాండమైన విఘ్నేశ్వరుని విగ్రహం ఉన్నది. ఒక పెద్ద కొండరాతిని మలచిన శిల్పం అది. అత్యంత కళాశోభితమై విరాజిల్లుతున్నది.

**15. వాతాపిగణపతి**



''అర్జునా! విఘ్నేశ్వర దేవుడిని అర్చించి ప్రణామములు అర్పించు. తరవాత వాతాపిగణపతిగా పేరుపొందిన ఈ దేవుని గురించి, వాతాపినగరం గురించి సవిస్తరంగా చెప్తాను,'' అని అన్నాడు ధౌమ్యుడు.

అర్జునుడు పూజాక్రమం జరిపి, వాతాపి గణపతిని భక్తి ప్రపత్తులతో ఆరాధించాక ధౌమ్యుడు వాతాపి నగరంలోకి దారి తీశాడు. అతని వెనుక అర్జునుడు వెళ్ళి నగరాన్ని చూశాడు. ఒకప్పుడు ఆ నగరం మహా వైభవంతో వెలిగిన ఛాయలు గోచరించాయి. కాని ఇప్పుడు నగరం ఆలనా పాలనా లేక బీడుపడిఉన్నది. లెక్కకు రాని కొద్ది మంది పౌరులు కనిపించారు. అర్జునుడి రాకకు వారు సంతోషంతో స్వాగతం పలికి, పాలనావ్యవస్థ ఏర్పరిచి నగరాన్ని పునరుద్ధారణ చేయమని ప్రార్థించారు.

''అర్జునా! ఇది వాతాపినగరం. నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వరుడు అగస్త్య మహామునిచే నెలకొల్పబడిన అద్భుత శిల్పం. ఇది వాతాపిగణపతి క్షేత్రంగా పిలువబడుతున్నది. విశేషాలు చెప్తాను విను!'' అంటూ ధౌమ్యుడు చెప్పడం ప్రారంభించాడు:

గంగ, కవేరుడు అనే రాజర్షి కమండలువులో పడి కావేరిగా రూపు ధరించి, అతని కుమార్తెగా ఆశ్రమంలో పెరిగింది. అగస్త్యుడు ఆ కన్యను చూసి వివాహం చేసుకుంటానని కవేరుడితో చెప్పాడు.

కవేరుడు తన సమ్మతిని తెలిపి, ''అగస్త్యా! కావేరి అభిమతం కూడా తెలుసుకుంటే మంచిది గదా!'' అన్నాడు.

అగస్త్యుడు ఆశ్రమంలో కావేరితో చనువుగా ఉంటూ ఉండగా ఒకనాడు కావేరి అతనితో సహ్యపర్వతం మీద వనవిహారం చేయాలని ఉందని చెప్పింది. అగస్త్యుడు కావేరిని తీసుకెళ్ళాడు.

వనవిహారం చేస్తూ ఒక చిన్న మడుగులో తామరపువ్వును చూసి

ముచ్చటపడుతూ, కావేరి చరచరా వెళ్ళి, దాన్ని తీసుకోడానికి మడుగులో అడుగు పెట్టింది. నీటితాకిడితో ఆమె అమాంతంగా జలరాశిగా మారిపోయి, వరదలా పొంగి సహ్యపర్వత శిఖరాల నుండి జలజలా జారుతూ కావేరి నదిగా పరవళ్లు తొక్కుతూ ప్రవహించింది.



అగస్త్యుడు కావేరినే తలచుకొంటూ చాలాకాలం బ్రహ్మచారి గానే ఉండి పోయి, గొప్ప తపస్సు చేసి ఋషి శ్రేష్ఠుడు అనిపించుకున్నాడు. ఒకనా డతడు అరణ్యంలో చెట్టుకొమ్మకు తల క్రిందులుగా వ్రేలాడుతున్న పితృ దేవతలను చూసి, ఎవరు మీరు? ఎందు కిలా ఉన్నారని అడిగాడు.

వారు నిట్టూర్పులు విడుస్తూ, "మా వంశీకుడు అగస్త్యుడు ఒక ఇంటివాడై సంతానం కనేవరకూ ఇలాగే ఉంటాము!" అని చెప్పారు.

అగస్త్యుడు తన దివ్యదృష్టితో విదర్భ రాజుకు కావేరి అంశతో కుమార్తె పుట్టి, లోపాముద్ర పేరుతో పెరిగి యుక్త వయస్కురాలై ఉన్నట్లు తెలుసుకొని వెళ్లి, ఆమెను తన కిచ్చి వివాహం చేయవలసిం దని విదర్భరాజును కోరాడు.

కందమూలాలు తింటూ నార కట్టుకు తిరిగే మునికి సుకుమారి రాకుమారిని ఎలా యివ్వడం? యివ్వకపోతే శపిస్తా డేమో అని రాజు సంశయపడుతూ వ్యాకుల చిత్తుడై ఉండగా, లోపాముద్ర అగస్త్యుడితో నిరభ్యంతరంగా వెంటనే తన వివాహం జరిపించమని చెప్పింది.

విదర్భరాజు ఆ విధంగానే లోపా ముద్రను అగస్త్యమహర్షి కిచ్చి అతనితో పంపాడు.

అగస్త్యుడు లోపాముద్రతో తన ఆశ్రమానికి వచ్చాక ఒకనాడు, "నా పితృ దేవతలను పున్నామనరకం నుండి తరింప జేయడానికి నీ వలన సంతానం కనాలని నిన్ను వివాహం చేసుకున్నాను!" అని లోపాముద్రతో అన్నాడు.




అప్పుడామె తన ముతక చీర చూసుకొని విచారిస్తూ, ''వివాహం చేసుకోగానే సరా! నేను రాజపుత్రికగా పుట్టి పెరిగినదాన్ని. నాకు తగ్గ మంచి బట్టలు, రత్నాభరణాలు సమకూర్చడం నీ విధి. అందుకు కావలసినంత ధనం సంపాదించుకురావడం నీ కర్తవ్యం!'' అన్నది.

అగస్త్యుడు భార్య మాటల్లోని వాస్తవాన్ని గ్రహించి, ధనసేకరణకు బయలుదేరాడు. అతడు చాలామంది రాజుల దగ్గిరికి వెళ్ళి, రాజ్యపాలనకు సరిపడగా మిగిలిన ధనాన్ని తనకిమ్మన్నాడు. ఏ రాజు కూడా మిగులు చెప్పలేదు సరికదా ఎంతో లోటు పడుతూన్నట్లుగా చెపుతూ, తమకు కూడా ఏమైనా ధనలాభం కలిగే మార్గం చూపమని వేడుకున్నారు.

అగస్త్యుడు హతాశుడై అరణ్యమార్గంలో వెళ్తూ, ఒకచోట ఉన్నతమైన ఒక మహాశిలను చూశాడు. ఆ రాయి లంబోదరుడైన విఘ్నేశ్వరుడిని పోలినట్టుగా కనిపించింది. ఆ మహాశిలనే విఘ్నేశ్వరుడిగా భావిస్తూ అగస్త్యుడు నమస్కరించి, ''గణపతీ! తపస్సు తప్పితే రెండో ధ్యాస లేని వాణ్ణి. ధన సంపాదనకు విద్య లేవీ నాకు తెలియవు. ధనం నాకు ఎలాగ లభిస్తుంది? నీవైనా నాకు ఒకదారి చూపవా?'' అంటూ వేడుకున్నాడు.

అప్పుడు, ''ఏమిటి, మహర్షీ! శిలతో మంతనాలాడుతున్నావు!'' అంటూ విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించాడు.

అగస్త్యుడు ప్రణమిల్లి మ్రొక్కి తన మొర వినిపించాడు.

విఘ్నేశ్వరుడు, ''అగస్త్యా! రావలసిన చోటుకే వచ్చావు, రావలసినవాడివే వచ్చావు. కొంచెంసేపట్లో ఇల్వలుడు నిన్ను భోజనానికి పిలుస్తాడు, వెళ్ళు! ఇల్వలుడి దగ్గిర అంతులేని ధనరాశి మూలుగుతూ ఉంది. నీ వలన కాగల కార్యం కూడా ఉంది!'' అన్నాడు.

అగస్త్యుడు, ''గణపతీ! ఈ మహాశిలలో నీ పోలికలు నాకు కనిపించాయి.




అందుచేత, ఈ శిల అపూర్వ గణపతి విగ్రహంగా రూపొందాలనే నా కోరిక కూడా సఫలంచెయ్యి!'' అని కోరాడు.

విఘ్నేశ్వరుడు, "అలాగేఅవుతుందిలే!" అని చెప్పి అంతర్థానమయ్యాడు.

అగస్త్యుడు చాలా అలసి ఉన్నాడు. ఆకలిగా కూడా ఉంది. ఆయాసంగా మహా శిలను అనుకొని కూర్చొని అలా చూస్తూం డగా, అతిథులను వెంటబెట్టుకొని వస్తున్న ఇల్వలుడు కనిపించాడు. అగస్త్యుడికి విషయమంతా తృటిలో తెలిసిపోయింది.

ఆ అరణ్యంలో వాతాపి, ఇల్వలుడు అనే గొప్ప మాయావులైన రాక్షసులు ఋషులను, యాత్రికులను, బాటసారులను చంపి ధనాన్ని దోచుకొని, పెద్ద రాతిదుర్గంలో పోగుచేస్తున్నారు. ధర్మము మూర్తీభవించిన మహారాజు వేషంతో ఇల్వలుడు ఆతిథ్యానికి తీసుకువచ్చిన వారికి వినయవిధేయతలతో మర్యాదలు కుశలప్రశ్నలు జరుపుతున్న సమయంలో, వాతాపి బాగా కొవ్వుపట్టిన మేకపోతుగా మారుతాడు. ఇల్వలుడు ఆ మేకను తెచ్చి చంపి వండించి, మేకమాంసంతో భోజనం పెడతాడు.

అతిథులు భుక్తాయాసంతో విశ్రమిస్తున్న సమయంలో ఇల్వలుడు గొంతెత్తి, ''వాతాపీ!'' అని పిలుస్తాడు. వాతాపి అతిథుల పొట్టలు చీల్చుకొని వస్తాడు. ఆ దుర్మార్గులు చేస్తున్న పనికి అగస్త్యుడి ఒళ్ళు మండిపోయింది.

ఇల్వలుడు అగస్త్యుణ్ణి సమీపించి, వీడెవడో చాలా గొప్ప ఋషిలా ఉన్నాడు. ఇలాంటి వాళ్ళను ఎంతమందిని హతమార్చితే అంత మంచిది, అని అనుకుంటూ సవినయంగా భోజనానికి ఆహ్వానించాడు.

అగస్త్యుడు ఆకలితో అలమటించి పోతున్నవాడిలాగ పరమానందం కనబరిచి, ''ఓ ధర్మదాతా! నీ లాంటి వాళ్ళుండబట్టే యీ భూమండలం అనంతాకాశంలో యిలా నిలిచి ఉంది. పద!'' అంటూ ఇల్వలుడి వెంట రాతి

దుర్గానికి వెళ్ళి, "ఓ అన్నదాతా! చాలా రోజులుగా తిండి లేదు, ఆకలి దహించేస్తున్నది. వెయ్యి యజ్ఞాలు జరిపించినవాణ్ణి కావడంవల్ల, మేకమాంసం తప్పితే మరేదీ అరగని రోగం ఒకటి పట్టుకున్నది. అంచేత, ముందు నాకు ఆ మాంస భోజనం పెట్టి నన్ను పంపించు," అన్నాడు.



ఇల్వలుడు, "స్వామీ! మీ కోసమే రాసిపెట్టి ఉన్నది కాబోలు, మా ఇంట చిరకాలంనించీ ఒక మేకపోతు పెరుగుతూ బాగా కొవ్వుపట్టి ఉన్నది!" అని చెబుతూ వెంటనే మేకరూపంలో ఉన్న వాతాపిని చంపించాడు.

అగస్త్యుడు మేకను చూసి, "ఆహా! ఏం మేక, ఏం మేక! వెయ్యి యాగాలు చేయించానన్న మాటే గానీ ఇలాంటి మేకను రుచిచూడలేదు, నాయనా! ముందు దీని గుండెకాయ మొదలైన మేలు ముక్కలన్నీ నాకు పెట్టి, ఆ తర్వాత మిగతాది అతిథులకు పెట్టు! ముందే చెబుతున్నాను, మరేం అనుకోకు. మాంసం తప్ప మరేదీ నేను తినలేను సుమా! నేను తినగలిగినంతా నాకు వడ్డించాలి, మర్చిపోకు!" అన్నాడు.

ఇల్వలుడు అగ్నిలో మేకను కాల్చి, మాంసం వండించి అగస్త్యుడికి పెట్టాడు. ఎంత వడ్డించినా తినేస్తూ అగస్త్యుడు పూర్తి మేకపోతు మాంసం ఆరగించి త్రేన్చాడు. ఇల్వలుడు ఆశ్చర్యంతో పాటు కొంచెం భీతి కూడా పడుతూ, "స్వామీ! తమరు మంచి ఘనాపాఠీల్లాగున్నారే!" అన్నాడు.

అగస్త్యుడు చిరునవ్వి, "ఘనాపాఠీల్లో ఘనాపాఠీగా మన పేరు ముల్లోకాలకూ తెలుసునోయీ! ఏదీ, కాస్త మద్యం తెప్పించు! ఒక కుండెడు చాల్లే!" అన్నాడు.

ఇల్వలుడు మరింత నివ్వెరపోతూ, "కుండెడు మద్యం తాగుతారా, స్వామీ!" అన్నాడు.

అగస్త్యుడు, "మన పొట్టకు సముద్రాలే చాలవు!" అన్నాడు.

ఇల్వలుడు, "అలాగే తాగుదురుగాని. మా వాడు వాతాపి తెప్పిస్తాడు!" అని చెబుతూ, "వాతాపీ!" అంటూ గొంతెత్తి కేక వేశాడు.

అగస్త్యుడు నెమ్మదిగా, "ఇంకెక్కడి వాతాపి! వాతాపి మరి రాడు. జీర్ణం, జీర్ణం, వాతాపి జీర్ణం!" అంటూ కడుపు నిమురుకుంటూ, "వాతాపి హరించి పోయాడు!" అన్నాడు.

ఇల్వలుడు ప్రాణభీతితో గజగజ వణికి పోతూ జాడలేకుండా పారిపోయాడు. ఆ విధంగా వాతాపి ఇల్వలుల దారుణ హత్యాకాండల మాయా నాటకం అంతమైంది.

ఆ తరువాత అగస్త్యుడు మిగతా అతిథులకు జరిగిందంతా చెప్పి, రాతి దుర్గంలో కుప్పతెప్పలుగా పడి ఉన్న అస్థిపంజరాల్నీ, కపాల రాసులనూ చూపించాడు. వారంతా గుండెలు బాదు కుంటూ, బ్రతికి బయట పడ్డందుకు అగస్త్యుడికి ప్రణమిల్లి మ్రొక్కారు.

ఆ దుర్గంలో పదిలంగా భద్రపరిచి ఉన్న ధనరాసుల్ని అగస్త్యుడు చూశాడు. తనకు కావలసినది పోగా మిగిలిన ధనంతో ఒక మహానగరం నిర్మించవచ్చు. వేలాది మంది సుఖంగా జీవించవచ్చు నని ఆయనకు తోచింది.

వెంటనే అగస్త్యుడు అందరికీ ధనాన్ని పంచడం మొదలు పెట్టాడు. ఆ సంగతి విని, సమీప రాజ్యాల నుండి ఎంతో మంది ప్రజలు అక్కడకు చేరుకొని, అగస్త్యు డిచ్చిన ధనంతో ఇళ్ళు కట్టుకొని స్థిరపడ్డారు.

అగస్త్యుడికి విఘ్నేశ్వరుడి ఆకారం లాగ కనిపించిన మహాశిల కేంద్రంగా చుట్టూరా ఒక మహానగరం తయారైంది. వాతాపి జీర్ణంతో ఏర్పడిన ఆ నగరం వాతాపి నగరంగా పేరు పొందింది. అగస్త్యుడు స్వపరిపాలనా సూత్రాలను శిలాఫలకాల మీద చెక్కించి, నగరంలో పెట్టించాడు. ప్రజలే పాలకులుగా ఆదర్శప్రాయమైన ప్రజారాజ్యం ఏర్పడింది.






## 6

రాణీ జుబేదా ఆజ్ఞమేరకు మస్రూర్ వెంటనే హసన్ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. హసన్ తల్లి తలుపు తెరిచి, మస్రూర్‌ను చూసి, ఏం కావాలని అడిగింది.

"నా పేరు మస్రూర్. నేను ఖలీఫా గారి అంగరక్షకుణ్ణి. ఈ ఇంట్లో ఉండే అమ్మాయిని తీసుకురమ్మని మా రాణిగారి ఉత్తరువు!" అన్నాడు మస్రూర్.

హసన్ తల్లికి భయం పట్టుకున్నది. ఆమె కంపించిపోతూ, "నాయనా, మస్రూర్, మేము ఈ ఊరికి కొత్తవాళ్ళం. నా కొడుకు ప్రయాణం మీద వెళ్ళాడు. వెళుతూ తన భార్యను గడపదాటి వెళ్ళనివ్వవద్దని మరీ మరీ చెప్పాడు. అది బయటికి వెళ్ళితే ఏదో కీడు మూడుతుంది. దానికేదైనా జరిగిందో మా వాడు బతకలేడు. ఏం జేతును?" అన్నది.

"ఏమీ భయం లేదమ్మా! మా రాణిగారు మీ కోడలి అందచందాలు విని చూద్దామనే ఉద్దేశంతో పిలిపిస్తున్నారు. ఆ పిల్ల కేమీ రాకుండా నేను లేనా? క్షేమంగా తీసుకుపోయి క్షేమంగా తెస్తాను. ఇలా ఎంతమందిని తీసుకుపోయి ఇళ్ళ దగ్గిర దిగబెట్టాను కాను?" అన్నాడు మస్రూర్.

పరిస్థితి అనివార్యమైనదని హసన్ తల్లి గ్రహించింది. ఆమె లోపలికి వెళ్ళి తన కోడలికీ, మనమలకూ మంచి దుస్తులు వేసి అలంకరించింది. ఆ తరవాత వాళ్లతో బాటు తాను కూడా మస్రూర్ వెంట ఖలీఫా మందిరానికి బయలుదేరింది.

వారు వచ్చి చేరేసరికి రాణి జుబేదా సింహాసనం మీద కూచుని ఉంది. ఆమె చుట్టూ అనేకమంది దాసీలున్నారు.



వారిలో తూఫా కూడా ఉన్నది. జుబేదా హసన్ భార్యతో, "రా, అమ్మాయ్! ఇక్కడ మగవారెవరూ లేరులే. నీ మేలి ముసుగు తీసెయ్యవచ్చు," అంటూ తూఫా కేసి చూసింది. తూఫా ముందుకు వచ్చి, హసన్ భార్య ధరించిన మేలి ముసుగును ఎంతో భక్తితో తీసివేసింది. గంధర్వ చక్రవర్తి కుమార్తె ముఖం మబ్బులచాటు నుంచి బయటికి వచ్చిన పౌర్ణమి చంద్రబింబం లాగా ప్రకాశించింది. జుబేదా దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యంతో ఊపిరిపీల్చటం మరిచిపోయి, "ఏమిటీ అందం!" అని తమలోతాము గుసగుసలాడుకున్నారు.

జుబేదా తననుతానే మరచిపోయి, సింహాసనం మీది నుంచి లేచి, హసన్ భార్యను ఆలింగనం చేసుకున్నది. తరవాత ఆమెను సింహాసనం మీద కూర్చోబెట్టుకుని, తన మెడలోని పదిపేటల ముత్యాల హారాన్ని ఆమె మెడలో వేసింది. ఆ ముత్యాలహారం, ఖలీఫాను పెళ్ళాడిన నాటినుంచి జుబేదా మెడను అలంకరిస్తూ వచ్చింది.

"అమ్మాయీ, నీకు ఆటలూ, పాటలూ, నృత్యాలూ తెలుసునా? నీవంటిదానికి అవి తెలియకుండా ఉండవులే!" అన్నది జుబేదా రాణి.

"సాధారణంగా ఆడపిల్లలు నేర్చుకునే పాటలూ, నృత్యాలూ లాటివి నా కేమీ రావు. కాని మీకు ఆశ్చర్యం కలిగించే విద్య ఒకటి నాకు తెలుసును—నేను పక్షిలాగా ఎగరగలను!" అన్నది హసన్ భార్య.

"అద్భుతం! ఆశ్చర్యం!!" అన్నారు దాసీలంతా.

"రెక్కలు లేకుండా ఎలా ఎగురుతావు? ఒక్కసారి ఎగిరి చూపిస్తావా?" అని జుబేదా అడిగింది.

"రెక్కలు లేకపోవడమేమిటి? నాకు పక్షితొడుగొకటి ఉన్నది. మా అత్తగారిని పంపితే ఆ తొడుగు తెస్తారు," అన్నది హసన్ భార్య.

జుబేదా ముసలావిడతో, "అమ్మా, ఆ పక్షితొడుగుట, తెస్తారా? మీ కోడలు ఎగిరితే చూసి ఆనందిస్తాం," అన్నది.

హసన్ తల్లి గుండెల్లో రాయి పడింది. ఇక తమను అల్లా మాత్రమే రక్షించగలడని మనసులో అనుకుని ఆమె జుబేదాతో, "మనుషులెవరైనా పక్షితొడుగులు తొడుగుతారా? ఏలినవారి సమక్షంలో నా కోడలు మతిచలించి మాట్లాడుతున్నది. అంత కంటె ఇంకేమీ లేదు," అన్నది.

కాని హసన్ భార్య ఆమెకు అడ్డువచ్చి, "నేను చెప్పిన పక్షితొడుగు మా ఇంట ఎక్కడో భద్రంగా దాచి ఉన్నది. సరిగా వెతికితే కనిపించి తీరుతుంది," అన్నది.

జుబేదా వెలలేని తన చేతి ఆభరణం తీసి ముసలిదానికిస్తూ, "అమ్మా, ఆ తొడుగు తీసుకురావాలి. లేకపోతే నాపైన ఒట్టు! ఎంతసేపు? ఒక్క క్షణం సేపు ఆనందించి ఆ తొడుగు మళ్ళీ మీకే ఇచ్చేస్తాను," అన్నది. కాని హసన్ తల్లి తనకా తొడుగు సంగతి తెలియదంటే తెలియదని మూర్ఖించేసరికి జుబేదాకు కోపం వచ్చింది. ఆమె మస్రూర్‌ను పిలిచి, హసన్ ఇల్లంతా గాలించి పక్షితొడుగు ఎక్కడ ఉన్నా వెతికి తీసుకురమ్మని ఆజ్ఞాపించింది. ఇంటి తాళపుచెవులను ముసలావిడ చేత మస్రూర్‌కు ఇప్పించింది.



మస్రూర్ ఇల్లంతా శోధించి చివరకు పక్షితొడుగు సంపాదించి, తెచ్చి జుబేదాకిచ్చాడు. జుబేదా దాన్ని కొంచెంసేపు పరీక్షించి, దానిలోని పనితనాన్ని చూసి ఆశ్చర్యపడి, దాన్ని హసన్ భార్యకిచ్చేసింది. ఆమె దాన్ని అందుకుని, ప్రతి ఈకా పరీక్షించి, తొడుగు చెక్కుచెదరకుండా ఉన్నందుకు సంతోషించి దానిని ధరించింది. తరవాత ఆమె తేలికగా గాలిలోకిలేచి మంటపం ఈ చివరనుంచి ఆ చివరకు ఎగిరివచ్చి నేల మీద వాలింది. ఆమె తన ఇద్దరు కొడుకులనూ తీసుకుని చెరొక భుజానా పెట్టుకుని ఎత్తుగా ఉన్న గవాక్షానికి ఎగిరి, అక్కడ వాలి, "నేను



పోతున్నాను, నాకు సెలవిప్పించండి,'' అన్నది. హసన్ తల్లి తివాసీ మీద కుప్ప కూలిపోయి కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నది. కోడలు ఆమెతో, ''అత్తా, నేను మిమ్మల్నీ, మీ అబ్బాయినీ వదిలి వెళ్ళిపోతున్నాను. మిమ్మల్ని గురించి నాకు బాధగానే ఉంది. కాని ఏం చెయ్యను! ఎగరటంలో ఉన్న నిషా నన్ను ఆవహించేసింది. నేను ఎగిరి తీరాలి. మీ అబ్బాయి నన్ను వెతకదలిస్తే వాక్-వాక్ దీవులలో వెతకవచ్చు. సెలవు!'' అంటూ గవాక్షంకుండా తన పిల్లలతో సహా ఆకాశంలోకి ఎగిరి పోయింది. స్పృహ తప్పి పడి ఉన్న హసన్ తల్లిని జుబేదా చేత్తో తాకిలేపి, ''అమ్మా, అసలు ఏమీ తెలియనట్టు నటించకపోతే, పర్యవసానం ఇలా అవుతుందని చెప్పి ఉండరాదా? ఇంత దాకా రానివ్వకపోదునే! తెలియక చేసిన ఈ పొరపాటును క్షమించాలి,'' అన్నది.

''తప్పంతా నాదే, తమరిని నేను క్షమించటమేమిటి? నేనూ, నా కొడుకూ దుఃఖంతో కుమిలి చావాలని రాసిపెట్టి ఉన్నది, ఇంతకూ!'' అంటూ హసన్ తల్లి తన ఇంటికి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి పోయింది. ఒక వేళ తన కోడలూ, మనవలూ కనిపిస్తారేమోనన్న భ్రమతో ఇల్లంతా వెతికింది. కాని వారెందుకు కనిపిస్తారు? ఆమె ఒక పెద్ద సమాధీ, రెండు చిన్న సమాధులూ ఇంట్లో కట్టించి వాటి చెంతనే అహోరాత్రాలు ఏడుస్తూ కొసప్రాణంతో ఉండిపోయింది.

అక్కడ హసన్ ఏడుగురు రాజ కుమార్తెలతో మూడు నెలలు గడిపి, తన కోసం తన భార్యా, తల్లీ నిరీక్షిస్తూ ఉంటారనే బెంగతో తన ''అక్కలకు'' వీడ్కోలు చెప్పి, డప్పు మోగించి, ఒంటెలను రప్పించి, రాజ కుమార్తెలిచ్చిన బంగారమూ, వెండీ, రత్నాలూ వాటిపైన పెట్టించి, త్వరలోనే బగ్దాదునగరానికి తిరిగి వచ్చాడు.

అతను ఇంట్లో ప్రవేశించి తన తల్లిని గుర్తించలేకపోయాడు. తరవాత ఆమెను, ''నా భార్య ఏదీ? పిల్లలేరీ?'' అని అడిగాడు. ఈ ప్రశ్నకు జవాబుగా తల్లి పెద్ద పెట్టున ఏడవసాగింది. హసన్‌కు మతిపోయినట్టయింది. అతను ఇల్లంతా గాలించటంలో, తన భార్య తాలూకు పక్షి తొడుకు దాచి ఉంచిన పెట్టె ఖాళీగా కనిపించింది. మూడు కొత్త సమాధులు కనిపించాయి. వాటిని చూస్తూనే అతను ఒక్క కేకపెట్టి విరుచుకు పడిపోయాడు.

తల్లి ఎన్ని ఉపచారాలు చేసినా హసన్‌కు రాత్రి పడినదాకా తెలివిరాలేదు. తెలివి వచ్చాక అతను తన బట్టలు చించుకున్నాడు. నెత్తిన దుమ్మూ, బూడిదా చల్లుకున్నాడు. కత్తితో పొడుచుకుని చావ యత్నించాడు—కాని తల్లి అడ్డు పడింది. ఆమె అతన్ని చిన్న పిల్లవాణ్ణి పొదివినట్టుగా దగ్గరికి తీసుకుని, జరిగినదంతా చెప్పి, ''నాయనా, నువ్వు బొత్తిగా నిరాశ పొందనవసరం లేదు. వాక్-వాక్ దీవులకు వెళితే నీ భార్య దొరకవచ్చు,'' అన్నది.

ఈ మాట వింటూనే హసన్‌కు కొత్త ప్రాణం వచ్చినట్టయింది. అతను చివాలున లేచి నిలబడుతూ, ''అమ్మా, నేనిప్పుడే వాక్-వాక్ దీవులకు ప్రయాణమవుతున్నాను,'' అన్నాడు.

కాని పక్షికూతలాంటి పేరుగల దీవులు ఎక్కడ ఉంటాయి? వీటికోసం ఇండియా వెళ్ళాలా? పర్షియా వెళ్ళాలా? చీనా వెళ్ళాలా? అతనికేమీ తెలియదు.

అతను తిన్నగా ఖలీఫాగారి దర్బారుకు వెళ్ళి అక్కడ ఉన్న పండితు లందరినీ వాక్-వాక్ దీవులు ఏ సముద్రంలో ఉంటాయని అడిగాడు. కాని ఒక్కరికీ తెలియదు. ఒక్కరైనా ఆ దీవులను గురించి విని ఉండలేదు. అతనిలో మొలకెత్తిన ఆశ అంతలోనే నశించిపోయింది. ''ఇంక నేను పోయేది ఏకంగా పితృలోకానికే!'' అనుకుంటూ అతను ఇంటికి వెళ్ళి పడుకున్నాడు. —(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 మే నెల సంచికలో ప్రకటింపబడును.







P. Sundaram Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చదవాలని తహతహ

రెండవ ఫోటో : చదవలేమ చకచక

**పంపినవారు :** లింగినేని కృష్ణమూర్తి, విశాఖపట్నం.

బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26





# 50%
# ఆదా చేయండి

మీకు రెండు అవసరం
అయినపుడు
ఒకటి మాత్రమే కొనండి.



## కేమ్లిన్ 'విరగని' పెన్సిళ్లు ఎక్కువకాలం మన్నుతాయి

బాగా నొక్కబడి తయారైన లెడ్, జాగ్రత్తగా సీజను చేయబడిన కలప... ఈ రెండూ ఒక ప్రత్యేకమైన పద్ధతి ద్వారా జతపర్చబడినవి; చెక్కేటపుడు విరగని పెన్సిళ్లను కేమ్లిన్ మాత్రమే అందచేస్తుంది. ఎక్కువ కాలం మన్నే పెన్సిళ్లు మీకు లభిస్తాయి. ఇతర సాధారణ పెన్సిళ్ల కంటే రెండింతలు ఎక్కువ మన్నేవి. మీరు సులభంగా గుర్తు పట్టడానికి వీలుగా ఇపుడు అన్ని కేమ్లిన్ పెన్సిళ్లు ఒక ప్రత్యేకమైన చిహ్నం కలిగివుంటాయి. ఈ చిహ్నాన్ని చూచి మరీ పెన్సిళ్లు కొనండి.

పైకం ఆదా చేసుకోండి. నాణ్యతకు గ్యారంటీ ఒసగే ఈ పేర్ల కొరకు చూడండి.

ఈ చిహ్నం కొరకు చూడండి. ఇదే మీ పొదుపు చిహ్నం.

త్రివేణి, సుప్రీమ్, ఎక్సెలా, రీగల్

**కేమ్లిన్** విరగని పెన్సిళ్లు












కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
బొంబాయి 400 059.

కేమెల్ ఆర్ట్ మెటీరియల్ ఉత్పాదకులు

VISION/795/R/TEL

**Results of Chandama—Camlin Colouring Contest No. 22 (Telugu)**

*1st Prize:* T. J. Bhaskar, Pakala-517-112. *2nd Prize:* Joginder Shandilay, Jullundur. *3rd Prize:* Bhanumathi, Madanapalle-517 325. *Consolation Prizes:* K. V. Sree Rama Murthy Hyderabad-500 264. Kommineni Sriniasa Rao, Guntur-1. S. Jaidev, Vijayawada-10., N. Srinivasa Rao, Kakinada-533 004. D. Satyanarayana, Nizamabad-503 001.

# Freshness in a Flash.

**Because only Flash now has an exclusive sky-blue mouth purifier.**




**Flash**
DENTAL CREAM

The sky-blue mouth purifier in Flash will freshen your breath the moment you start brushing your teeth, and will leave your entire mouth sparkling clean and fresh. No wonder Flash won the world selection award in Vienna for its quality for total mouthcare. Because the care tha comes in Flash will brighten your health smile day after day.

**Flash a smile. Pass it on.**